# శ్రీమదాంధ్ర

# మహాభారతము.

పండిత పరిశోధితము

---

సాహిత్య విద్యాప్రవీణ
చిపుకుల
సుబ్బరామశాస్త్రి
గారి
లఘువివరణ
సహితము.

## శాంతిపర్వము

భాగము 1.

ప్రకాశకులు

## ఆంధ్రగ్రంథమండలి

కోటంరాజు వేంకట దుర్గావరప్రసాదరావు, బి. ఏ.,
ప్రొప్రైటర.

చందాదారులకు రు 0-11-0.
ఇతరులకు రు 1-0-0.

ఓమ్.

# శాంతిపర్వము.

# భూమిక.



శ్లో. బ్రహ్మానందం పరమసుఖదం కేవలంజ్ఞానమూర్తిం।
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం।
ఏకంనిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥
వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనం।
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్॥

శ్రీమన్మహాభారతమను సుప్రసిద్ధ వ్యవహారమును, జయమను విద్వద్వ్యవహారమును గల్గియున్నట్టి గ్రంథరాజమునందు శాంతిపర్వమను భాగము శిరోవతంసమట్లు సర్వోత్కృష్టంబుగ విబుధలోకముచే గొనియాడఁబడుచున్నది. ఇట్టిప్రశంసనుబడయుటకు నీపర్వమునందలి విషయగౌరవమని వేఱువచింపనక్కఱలేదు. ఇందలి విషయమీపర్వనామముంబట్టి శాంతియని సామాన్యముగ గ్రహింపఁబడుచునేయున్నను నట్టి నామమెట్లు సార్థకతఁజెందుచున్నదో యద్దానినొకింత విషయస్వరూపప్రదర్శనంబుచే నిరూపింపునాశయముమీఱ నీభూమిక వెలయుచున్నది. ప్రకృతమున విషయప్రదర్శనాది విమర్శనంబు

నిర్వహణోత్సాహంబంకురింప వివిధాశీర్వాదంబులుంబడసి ధర్మ జుండు గరినగరంబు ప్రవేశించె. ఇట్లు ధర్మజు చిత్తశాంతినిం బడసిన కథావిశేషముతో నొప్పారుటంజేసి యీపర్వమునకు శాంతియను నామము సార్థకమగుచున్నయది. ఇయ్యది యొక కారణము.

ఇంక రెండవది ధర్మరాజుయొక్క పట్టాభిషేక మింపు వర్ణింపఁబడుట. ధర్మరాజు పట్టాభిషేకమువలన భారతభూమి యందు దదివఱకుఁ బెద్దకాలమునుండి ప్రవర్తిల్లియుండిన ధర్మ విప్లవకారణములు పుష్కలముగ నుపశమించి సకల లోకములు శాంతినిఁ బడయుటచే నట్టి యఖిలలోకశాంతిహేతునిరూపణ ముచేఁగూడ నీపర్వనామము సార్థకతఁ జెందుచున్నయది.

ఇవి రెండును సామాన్య విషయములు. ఇంతకు విశేష మొండు గలదు. అయ్యది శేషించిన యైదాశ్వాసములందుఁ దెలియ వచ్చెడి విషయ విశేషమే. ప్రకృతపు నైదాశ్వాసము లందలి విషయవిశేష ప్రస్తావమిత్తెఱంగునఁ బఱగుచున్నయది.

సమధిగత సామ్రాజ్యుండై ధర్మనందనుండు తేజోవిశే షంబునఁ గృష్ణునారాధించుచు సమస్త పౌరజనపదకోటుల మనంబులం బ్రమోదంబు పరిపూర్ణంబగునట్లుగా ప్రవర్తిల్లు చుండి యొక్కనాఁడు రేపకడ కృష్ణునియున్న మందిరంబునకుం బోయి పలువిధంబులగు సల్లాపంబులుసేసి పిమ్మట శ్రీకృష్ణుని తోడను భీమసేన ప్రముఖులతోడను నోఘవతి తీరంబున శర తల్పగతుండైయున్న గాంగేయుం జేరంజని యచ్చటనున్న సా

త్యవతేయ ప్రభృతి మునీంద్రులకుం బ్రణమిల్లి భీష్మునం గాంచిరి.
అట్లు సముచిత ప్రకారంబునం గని యతనిం బరివేష్టించి యాశీ
నులైరి. అప్పుడు శ్రీకృష్ణుం డమ్మహాత్ము నాలోకించి యుప్ప
లించుచుఁ బాండవాగ్రజుం జూపి యిట్లనియె.

«నీవు తపోవిశేష మహనీయతఁ జేసి జగంబులన్నియు నన్
భావమునం గనుంగొన నృపాలమహోత్తర చాలుదీతఁడు త్యా విల
చిత్తుఁ డయ్యె సుహృదాప్తమృతిఁ దురటిల్లు నెవ్వగం బోవగఁ
ద్రోవ నీదయిన పుణ్యతమస్ఫుటవాక్యపద్ధతిఁ॥

వ॥——నాలుగువర్ణంబులకును నాలుగాశ్రమంబులకు
నిట్టిట్టివియర్థంబులని నాలుగు వేదములం జెప్పిన ధర్మంబులు నీకు
విదితంబులు ప్రవృత్తినివృత్తులును సాంఖ్యయోగంబులును బురా
ణేతిహాసంబులు ధర్మశాస్త్రంబులు నవగతంబులు సర్వసంశ
యచ్ఛేదనదక్షుండవీ వీక్షితిపతి నాదరింపుము శోకమోహగ్రస్తం
బగు జనంబు నిస్తరింపం జేయుటగదా మిముబోఁటుల బుద్ధివిస్తా
రంబునకు ఫలంబని” యానతియ్యనట్టి భగవదాజ్ఞను శిరసావహిం
చి ధర్మజునుద్దేశించి శంకింపక నన్నేమియైన నడుగు మనిన నమ్మ
హీపతి మాధవునకుం బ్రణమిల్లి పారాశర్యప్రభృతి మునివర్యు
లకు నభివాదనం బాచరించి సర్వకౌరవులయనుమతివడసి యప్పి
తామహునకభిముఖుండై నమస్కరించి యిట్లనియె:-

“అనఘ నీదుబుద్ధియతిలోకమగుటయుఁ దెలిసికొనగ నాకు
వలయునట్టి ధర్మకోటి నీవ తగఁ జెప్ప వినవలయుటయుఁ జెప్పఁ
నంబుజోదరుండు। -

ధర్మవిదులు రాజు ధర్మస్వరూపుగాఁ జెప్పుదురఁ దద్వి విశేషవృత్తి। భరముగాఁదలంతు నరవర చెప్పవే మున్నురాజ ధర్మముల తెఱంగు"—

"అనుటయు నాపగేయుఁడు మహత్త్వసముంచితమైన ధర్మమున్వినుతవిధాతృభావమహనీయుని గృష్ణుని వేదమూర్తి నాఁజనుధరణీసురావళిఁ బ్రసక్తిఁదలంచి నమస్కరించి యజ్ఞపపతి వక్త్రమాదర రసప్లుతదృష్టినిఁజూచి యిట్లనున్॥" నృపధర్మములన్నియు నీ కుపదేశించెద వినంశయోక్తుల మఱియున్। విపుల ఫలవంతమగు ధర్మపథంబును నడిగినెడఁ గరమ్ము వివరింతున్"—

అని కురుపితామహుండగు భీష్ముండుపదేశించిన ధర్మములీయైదాశ్వాసములుగా నలరారుచున్నవి. అందు మున్ముందు ననగ రెండుమూఁడాశ్వాసములందు నుపదేశింపఁబడినవి రాజధర్మములు. రాజధర్మములు సకలలోకశాంతి హేతువులగుటంజేసి యవ్వాని ప్రతిపాదించుగ్రంథము శాంతియను నామముచే నొప్పుట సర్వవిధముల సమంజసము. శేషించిన మూఁడాశ్వాసంబులందును రాజుచే సకలలోకశాంతికొఱకుఁ బ్రవర్తింపఁజేయఁబడవలసిన వర్ణాశ్రమాచారధర్మంబు లుపదేశింపఁబడుటయే కాక, సకలపురుషులచేఁ దీవ్రముగ నభిలషింపఁబడు మోక్షధర్మంబు పుష్కలముగ నుపదేశింపఁబడుచున్నది. మోక్షమన్నచో పరమశాంతి. ఇట్టి శ్రేష్ఠతమంబులగు ధర్మంబులగల్గియుండుటచేత నీగ్రంథనామము సార్థకతను జెందుచున్నది. ఇట్టిధర్మ

ముల ధర్మజున కుపదేశించుటచేతనే భీష్మునకాచార్యత్వము లభించి నేటివఱకును భీష్మాచార్యుఁడను బిరుద మప్రతిహత ముగ సుప్రసిద్ధవ్యవహారము గనుచున్నది. భీష్మునిచే నుపదేశింపఁబడిన రాజధర్మమంతయు "దండనీతి"యను నామంబుచే నలరారుచున్నయది. దీనినే రాజనీతియనియు నర్థశాస్త్రమనియుఁ గూడ బుధులు సెప్పుచుందురు. ఇట్టిదండనీతిని యితరధర్మములను తదుత్పత్తిమొదలు దనవఱకుఁ బారంపర్యక్రమమున లభించినదాని సప్రమాణముగ భీష్మాచార్యులు దండనాయకుఁడగు ధర్మరాజునకుపదేశించె నద్దాని సాంప్రదాయగౌరవ మొకింత చదువరులకు నభిరుచిగల్గింప వివరింపఁబడుచున్నయది.

—: దండనీతిజన్మ :—

"విను తొల్లికృతయుగఁబున మనుజులయెడ దండనీతి మంతుండైరా। జననొకఁడుగలిగి యరయుట మనుజేశ్వర లేదు ధర్మమతమందుత్రగణ॥

ఒండొరులకు రక్షకులైయుందురట్లుండ దైన్యమొద వినలోభం।బొండొండపెరిఁగి ధర్మము ఖండితమై మొదలుకొని ర కార్యంబులకుఁణ॥ క్రమమునఁ గామము రాగము దమ మనముల నొదఁవగా మదంబెక్కిన విభ్రమమొందుచు విచ్చలవిడివి మార్గ చరితముల వేదవిధ్వంసకులై॥

మనుజులు ధర్మముఁబాడవడఁచిన వేదము గర్మములును జెడుటకు భయమం। దిన యింద్రాదులు గమలాసను గాసఁ? మునులుఁ దారు జనిరి నరేంద్రా॥

చని యద్దేవుంగని మనుజలోకంబున వేదంబులు ధర్మాంబులుం బాడ వడంగిన సద్వ్యరరాహిత్యంబున నే మునుమర్త్యులమై భయంబంది వచ్చితిమి రక్షింపుమని యవ్విబుధులు విన్నవింప విరించిదానికిం బ్రతివిధానంబు సేసెదనని పలికి స్వామ్యమాత్యరాష్ట్రదుర్గకోశ సుహృద్బలంబులు నాన్వీక్షికీత్రయీవార్తాదండనీతులును నరిమిత్రోదాసీనాదిక ద్వాదశరాజమండలంబును సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయంబులును మొదలు గావలయువానికిం బ్రబోధకంబులగు నానావయవంబులుంగలిగి ధర్మార్థకామమోక్షంబులకు సాధకంబులయి యుండునట్లుగా నూఱువేలధ్యాయంబుల నఖిలలోకహితంబగు నీతిశాస్త్రంబు రచియించి యిది లోకచరిత్రనిర్మలీకరణంబునకుం గారణంబగు నని యనుగ్రహించె నాలోకపితామహులలాటంబున ననాదినిధనుండును విశ్వజగత్కర్తయు సర్వభూతాత్ముండును సనాతనుండును నగు విరూపాక్షుండు విశాలాక్షుండను నామంబున నావిర్భవించి యాగ్రంథం బధిగమించి దాని నభ్యసించుటకు మర్త్యులకాయుర్బుద్ధులు సాలవని యుమ్మలించి యమ్మహనీయతంత్రంబు సంక్షేపరూపంబునం బదివేలధ్యాయంబుల వైశాలాక్షంబన నిర్మించె.

“ హరునివలనఁబడసి యాశాస్త్రమమరేంద్రు ।
డయిదువేలు సేసెనమరగురుఁడు ।
దేటపడనొనర్చెఁ ద్రిసహస్రకాధ్యాయ ।
రూపసమ్మితముగ భూపవర్య॥

దాని శుక్రుండు సహస్రాధ్యాయ పరిమితంబు గావించె.

మఱియు మనుష్యుల శక్తియెఱింగి మునులు క్రమంబున సంక్షిప్తరూపంబులు గా గ్రంథంబులఁ గావించిరిది నీతిశాస్త్రప్రవర్తన ప్రకారంబు".

ఇట్లు నీతిశాస్త్రంబును నాటంగోలె నభ్యసింపుచుఁ బ్రవర్తింపఁజేసిన వారలలో గణనీయుఁ బ్రకరణ సందర్భంబున స్మరింపుచు భీష్మాచార్యులు ధర్మజున కుపదేశించినటుల స్పష్టముగఁ దెలియ వచ్చుచున్నది. అట్టిపవిత్ర నామ సంకీర్తనము చే సాంప్రదాయవిదుల గుర్తెఱుంగనగును. అట్టి మహనీయుల నొకింత పేర్కొనియెదము.

ప్రకృతమున భీష్మాచార్యులు ధర్మజున కుపదేశించిన తెఱంగున సాంప్రదాయము ప్రవర్తింపు చుండును. దానం జేసి సాంప్రదాయమంతయు నెఱఁజూచిన నుభయుల సంవాద రూపమునఁ బరఁగుచుండు నట్టి సంవాద నామంబులే సాంప్రదాయాతిశయమును వ్యక్తీకరింపు చుండును. ప్రకృతమున నీశాంతియందు దెలియవచ్చెడి సంవాదము లెవ్వియన.

౧. బృహస్పతి వసుమన సంవాదము.
౨. వాయుదేవ పురూరవ సంవాదము.
౩. కుబేర ముచుకుంద సంవాదము.
౪. కేకయరాజ రాక్షస సంవాదము.
౫. కాలకవృక్షీయ క్షేమదర్శి సంవాదము.
౬. ఉతథ్యమాంధాతృ సంవాదము.
౭. వామదేవ వసుమన సంవాదము.
౮. ఇంద్రాంబరీష సంవాదము.
౯. వసుహోమ మాంధాతృ సంవాదము.

౧౦. బ్రహ్మదత్త పూజని సంవాదము.
౧౧. కణిక శత్రుంజయ సంవాదము.
౧౨. మేధావి తజ్జనక సంవాదము.
౧౩. భృగు భరద్వాజ సంవాదము.
౧౪. కాశికేక్ష్వాకుమహారాజ సంవాదము.
౧౫. మను బృహస్పతి సంవాదము.
౧౬. పంచశిఖ జనక సంవాదము.
౧౭. ఇంద్ర ప్రహ్లాద సంవాదము.
౧౮. ఇంద్ర బలిచక్రవర్తి సంవాదము.
౧౯. ఇంద్ర నముచి సంవాదము.
౨౦. శ్రీ శక్రి సంవాదము.
౨౧. దేవల జైగీషవ్య సంవాదము.
౨౨. ఉగ్రసేన శ్రీకృష్ణ సంవాదము.
౨౩. వ్యాస శుక సంవాదము.
౨౪. జాజలి తులాధార సంవాదము.
౨౫. కపిలస్యూమరశ్మి సంవాదము.
౨౬. జనక మాండవ్య సంవాదము.
౨౭. హారీత విద్వజ్జన సంవాదము.
౨౮. నారద గాలవ సంవాదము.
౨౯. అరిష్టనేమి సగరసంవాదము.
౩౦. పరాశర జనకసంవాదము.
౩౧. వసిష్ఠజనకసంవాదము.
౩౨. యాజ్ఞవల్క్య జనకసంవాదము.

౩౩. యాజ్ఞవల్క్యవిశ్వావసుసంవాదము.

౩౪. జనకసులభాసంవాదము.

౩౫. జనకశుకసంవాదము.

౩౬. నారదశుకసంవాదము.

౩౭. నారద నారాయణసంవాదము.

దీనింబట్టి భీష్మాచార్యులు దనస్వకపోలకల్పిత విశేషములగాక, శ్రుతిస్మృతి సదాచారసిద్ధమగు ధర్మమును ససాంప్రదాయముగ బోధించియున్నారలు. దానంజేసి యీశాంతి పర్వపుటతిశయము.

ఈగ్రంథమునఁ దెలియవచ్చెడి విశేషములలో దండనీతియుత్పత్తివలెనే దండనాయకోత్పత్తి విశేషముఁగూడఁ దెలియవచ్చెడిని. అయ్యదియుఁగూడ నొకింత యభిరుచికై ప్రదర్శింపఁబడుచున్నది.

"సురలు విశ్వలోకేశ్వరుండగు విష్ణుపాలికింజని నీతిశాస్త్రసముద్భవం బెఱింగించి దీనినధిగమింపను దదీయాచారంబునడపనుశక్తుండగువాని నొక్కరుని నిర్దేశింపవలయునని యభ్యర్థించిన నద్దేవుండు నిజతేజోమయుండుగా నొక్కమానసపుత్త్రి నిర్మించి విరజుండను పేరిడియె నతండు భూమికిం బ్రభువుగా నొల్లకుండెఁ దత్సుతుండు కర్దముండు ననపేక్షితరాజ్యుండై తపంబునకరిగెఁ దదీయపుత్త్రిండనంగుండు దండనీతినయించి భూప్రజలఁ బాలించె నతనికొడుకు నీతి యనువాఁ డమ్మహారాజ్యమున కభిషిక్తుండై యింద్రియవశత్వంబునొంది మృత్యుపుత్రి సునీథ యను గామినింబరిణయుం బైన దానియందు వేనుండు గలిగి

మాతామహదోషంబునం జేసి రాగద్వేషంబులం బ్రజకువిరుద్ధుం డయ్యె నట్లగుటయు మహామునులుగూడి యేతెంచి మంత్రపూతంబులగు కుశసంచయంబుల నతనిం బ్రశమితుం జేసి తద్దక్షిణోరుతలంబు మథించినఁ గాలినకొఱవి తెఱంగున నల్లఁదనంబు కుఱుచయొడలు నెఱ్ఱనికన్నులునై యశుచిత్వనిరూఢుండొకఁడు పుట్టె. వానింజూచి యాఋషులు నిషీద యనిపలికి వర్జించుటచేఁ దత్సంతానజాతులు నిషాదులనంబఱఁగి వింధ్యాదిగిరివనప్రదేశంబులఁ గ్రూరత్వంబున వర్తిల్లి రమ్మునులు మఱియు నారాజు దక్షిణబాహువు మథించిన నుజ్జ్వలత్కవచశరశరాసనభాసమానుండును వేదవేదాంగ ధనుర్వేదపారగుండునునగు పరమాకారవంతుండుదయించె. సకలదండనీతియు నప్పురుషునాశ్రయించె నతండమ్మహాత్ముల కభిముఖుండును బ్రాంజలియునై వినయంబున——

"వినుడు ధర్మార్థతత్త్వ ప్రవీణయగుచు
సూక్ష్మదర్శినియైనది సుకృతులార
నాదుబుద్ధి మీకెప్పనినడపవలయు
దీనఁగొని నన్నుఁబనుప రే దాని కనిన॥

వారును నవ్వైన్యాభిధాను నభినందించి:

"మానలోభములఁ గామక్రోధములఁబాసి
సర్వజంతువులకు సముఁడవగుచు
నియతధర్మము నీవు నిశ్శంక నడపుము
ప్రియము నప్రియము నుపేక్షఁగూర్చు,

దండనీత్యాశ్రయ ధర్మంబునాపని
దీనిఁజేయుదు సావధానవృత్తి
రక్షింతు శ్రితులవర్ణముల సంకరములు
సార నీ సదండ్యులు ధరణీదివిజు
లరయువాఁడనే భూప్రజ నని ప్రతిజ్ఞ
యనుమహోన్నతపద మెక్కెమనుఁడు నాతఁ
డవనిసురులు సహాయత్వ మాచరించి
రేని నట్లగుఁ గాక నియె గుమార

ఇట్లు మహనీయ ప్రభుత్వపదస్థుండై యమ్మహాత్ముండు శాస్త్రోక్తమార్గంబున దండనీతి పరిపాలనంబు ధర్మతాత్పర్య సమీచీనంబుగా నాచరించె.

"బ్రాహ్మణక్షతత్రాణ తత్పరతఁజేసి
క్షత్రియాభిధానంబు రంజనమునెల్ల
ప్రజకుఁ జేయుటకతమున రాజనామ
మును బ్రవర్తిల్లె నాన్నృపాలునకు బరగ."

తత్సంతతి జాతులెల్లను దత్కుల్యులై రాజత్వంబు వహించి దండనీతి పాలించిరి. దానంజేసి క్షత్రియులనియు రాజులనియును నామంబుల కాకరమైరి.

ఇట్లు దండనీతియొక్కయు రాజన్యులయొక్కయు నుత్పత్తి యిందుఁ గానవచ్చెడిని.

ఇట్లు పారంపర్యక్రమంబున వచ్చుచుండిన దండనీతి ద్వాపర యుగాంతమున నుచితముగు సంధనాయకుండగు ధర్మరాజు

నకు భీష్మాచార్యునిచే నుపదేశింపఁబడినది. దండనీతి యొక్కఁ డుఁగాదు సకలనీతులు నుపదేశింపఁబడినవి. ఇట్టి నీతులన్నియు సకలలోకముల శాంతికి హేతువులుగాఁగ నీపర్వమునకు శాంతి యను పేరుగల్గె.

ఇదియట్లుండ భీష్మాచార్యోపదేశంబున నొక విశేష ము గన నగును. ఉపదేశంబులందుఁ బ్రామాణ్యాతిశయముగల నానాయి యుపదేశికులయొక్కయు నవ్వాని గ్రహించిన వారలయొక్కయు నామసంకీర్తనము సేయఁబడియున్నది. అయ్యది యుచితమే. దుష్టజనలక్షణములు వారియెడల వర్తింపవలసిన వ్యాపార విశేషంబుల బోధించుపట్లఁ బురుషుల నామంబుల విడచి యన్యాపదేశంబుగ స్థావరంబులను మృగములను నానాయి స్థలంబులఁజొప్పించి యుపదేశించి యుండెను. అదె ట్లనిన.

—: ధర్మనందనుండు. :—

"సౌమ్యు లసౌమ్యులభంగి నసౌమ్యులు సౌమ్యులవిధమున జనవరచిత్తా! గమ్యతఁ దోతురు వారిని సమ్యజ్నిశ్చయతఁ గాంచు చందముసెపుమా॥

అనుటయు నాపగాతనయుండే తత్ప్రయోజనంబైన వ్యాఘ్రగోమాయు సంవాదంబను నితిహాసంబుగల దాకర్ణింపుమని యిట్లనియె. అని వ్యాఘ్రగోమాయు సంవాదమునుఁ బల్కెను.

ఆతీరుననె— యుధిష్ఠిరుండు దగుపదంబులకుఁగులవంతు లగు పరిజనులు దొరకొనకున్న నరనాథుండేమి సేయవలయు

నని యడుగ గాంగేయుండు కుర్కురోపాఖ్యానమునుఁ జెప్పె నట్లే ధర్మనందనుండు పెక్కండ్రుపగఱకునగ్గమై హీనబలుండై నరపతి యెప్పరుసున నాపద ని స్తరించువాఁడనియడిగిన భీష్ముం డు మార్జాల మూషిక సంవాదంబను నితిహాసంబు గలదది నీదగు ప్రశ్నంబునకు సదు త్తరంబగునని పలితరోమశులను మూషిక మార్జాలంబుల సంవాదమునుఁ జెప్పె. ఆతీరుననే గృ ధ్రజంబుకోపాఖ్యానము నాడీజంఘుని చరిత్రమునుఁ దెలియ వచ్చెడిని. ఇట్లు బోధించుట యుపదేశనైపుణ్యము. దుష్టుల నామసంకీ ర్తనముసేయుట యశాస్త్రీయమనియు నవ్వారల నా మంబులఁ బ్రవ ర్తించుటచే వారల యపయశంబు భూమియందు నిలచుటచే వారలకు నిహపరములు రెండింటికిని - గొఱతగలుగు నను మహదాశయముమీర వారలవలన లోకములు దెలసి కొనవలసిన నీతి నన్యాపదేశముగ పశుపక్ష్యాది నామంబులచే బోధించుట శిష్టాచారము. దానంజేసి పశుపక్ష్యాదులు మాట లాడునా? అయ్యవి రాజ్యాంగతంత్రముల నడపునా? యను గు యుక్తులతో నాయుపదేశములనుగాని గ్రంథమునుగాని చులకఁ చేయఁజూచుట సుజనలక్షణముగాదని ప్రాజ్ఞులు గ్రహింపఁగలరు.

ఇదియంతయు నటుండ నీపర్వమునందు గమనించవలసిన మహ త్తర విషయమొండు గలదు. అదెద్దియన. ప్రకృతపు కలి యుగమునకుఁ బూర్వము ద్వాపరాంతమున ధర్మసంగ్రహకా ములై చరించిన పుణ్యమూర్తుల యతిశయవిశేషముః. అట్టిపుణ్య మూర్తులు శ్రీకృష్ణభగవానులు, శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యా సులు, భీష్మాచార్యులును. ఇందు శ్రీకృష్ణ భగవానులయొక్క,

పరాత్పరతత్త్వము శ్రీకృష్ణుని భీష్ముండు భక్తియుక్తుండై స్తుతియించిన స్తవరాజమువలన సువ్యక్తమగుచున్నది. అయ్యది ముల్లోక విదితము.

భీష్ముని యొక్క మాహాత్మ్యమును శ్రీకృష్ణ భగవానులిట్లు ధర్మనందనునితోఁ బ్రశంసించియున్నవాఁడు.

"గంగ యెవ్వనిఁ దనగర్భంబునందతి
శ్లాఘాసమేతయై సంభరించె
భార్గవుం డెవ్వనిఁ బరమశిష్యుఁడుగాఁగ
బడసి గురుత్వ మెక్కుడుగ నెగడె
నా రాముఁ డెవ్వనితో రాసి యిరువది
మూఁడు దినములకు వాఁడి దోఁటఁ గెఁ
గాశీశుకన్యలు గారణంబుగఁ బోరి
యెవ్వనికోడి ర నేకనృపులు
వేదములు నాలుగును ధనుర్వేదమును మ
హాస్త్రములుఁ జెంది యెవ్వనియందు వెలిఁగె॥
నట్టి భీష్ముండు......... " అని

శ్రీకృష్ణ ద్వైపాయనుం డక్కాలమున జగద్గురుండై యున్నవాఁడాతని మాహాత్మ్యము ఐదు, ఆఱు ఆశ్వాసంబులందు విపులముగఁ దెలియ వచ్చుచున్న యది.

వీరలు ముప్వురును ద్వాపర యుగాంతమునఁ దమ తమ యధికారములనుఁదగు పురుషులకు సర్పించి కృతకృత్యులైరి. అట్టి యధికారపురుషు లిద్దఱు మహనీయులు. వేదవ్యాస భగవానులు దన జగద్గురుత్వంబును శ్రీశుకుని యధీనముం జేసి

వేదవ్యాస భగవానులచే జగద్గురుత్వంబొసంగఁబడిన శ్రీశుకుని యొక్క మాహాత్మ్యము ఐదాఱు ఆశ్వాసములందు సమగ్రముగఁ దెలియ వచ్చెడిని.

శ్రీకృష్ణ భగవానులన్ననో భూలోక సామ్రాజ్యము నకు ధర్మరాజునుఁ బట్టభద్రు గావించె. అట్టిధర్మజునకు శ్రీకృష్ణ భగవానులు వేదవ్యాసాది మహనీయుల సమక్షంబున భీష్మా చార్యునిచే సకలధర్మములునుపదేశమునుఁ జేయించె నని యీ శాంతియందు సర్వవిధములఁ దెలియవచ్చుచున్నయది. కావున నీభీష్మాచార్యోపదేశ మొక్క భీష్మాచార్యోపదేశమేకాక య ద్దాని నామోదించుచు నచ్చట నిలచియున్న శ్రీకృష్ణభగవానుల యొక్కయు శ్రీకృష్ణద్వైపాయన వేదావ్యాసులయొక్కయు నుపదేశమనిగూడ నిస్సందియముగఁ జెప్పనగు

## —: దేశకాల నిర్ణయము :—

ఇట్టిమహోపదేశమే దేశముననే కాలమునఁజేయఁబడెనను విషయమొకింత యాధునికబుద్ధివృత్తులకు నభిరుచిగల్గింప నిరూ పించుట, యనవసరముగాదు గావున నద్దానినొకింత దిఙ్మాత్ర ముగఁ బ్రదర్శించి యీభూమికను ముగింపుచున్నారము. ఉప దేశ దేశకాలములనుగూర్చి యిచ్చట దెలియవచ్చెడి విషయ మిట్లుఁ దెలియవచ్చెడిని.

సమధిగతసామ్రాజ్యుండై ధర్మనందనుం డొక్కనాఁడు రేపకడ శ్రీకృష్ణునిమందిరంబునకుంబోయి యాతనితో సల్లాపంబులుసేయుచు నరిగి యోఘవతీతీరంబున శరతల్పగతుండై యున్న భీష్మంగాంచిరనియు నప్పుడు శ్రీకృష్ణునియోగంబున భీష్ముండు ధర్మనందనున కుపదేశముసేసినట్లును దెలియవచ్చెడిని. మాధవధర్మజులు భీష్మునితోఁ బ్రశంసించిన కాలమిట్లు నిర్వచింపఁబడియె.

"అనఘ యినుఁడింక నేబదియాఱు దివస
ములకుఁ దానుత్తరాయణమునఁ జరింపఁ
దొడఁగు నీవప్డు దేహంబు విడిచిపోయెగు
దపునరావృత్తి పదమున కభినుతముగ॥

భీష్మనిర్యాణకాలమున నుత్తరాయణప్రవేశము మాఘశు ౭ మి యందైనట్లుఁ దెలియవచ్చెడిని. పిమ్మట నేకాదశి నాఁడు భీష్మాచార్యులు దేహత్యాగముసేసినట్లుఁ గొందఱు దలంతురు గాని మాఘ శు ౮ మి రోజున భీష్మనిర్యాణమైనట్లు భీష్మతర్పణదివసముగా వ్యవహారముండుటవలనఁ దెలియవచ్చెడిని. ఇయ్యది భారతయుద్ధమునకుఁ బరమునఁగల్గిన రథసప్తమియని వేఱఁజెప్ప నక్కఱలేదు. భారతయుద్ధమన్ననో ప్రకృతపు గల్యాదికిఁ బూర్వము ముప్పదియేడవ వత్సరమునందు జరిగినది. ప్రకృతపు గల్యాదియన్ననో క్రీ. ము 3102వ వత్సరమున ఫిబ్రవరి 17, 18వ తేదీలకు మధ్యరాత్రిమున శుక్రవారమున్న

ప్రారంభమైనట్లు గణకులందఱు పుష్కలముగ గుర్తించిన విష యమే. దానంజేసి భారతయుద్ధము 3102 × 37 అన క్రీ. పూ. 3139వ సంవత్సరమున జరగియున్నట్లు సుస్పష్టమే. దానంజేసి క్రీ. పూ. 3138వ సంవత్సరమున మాఘ శు ౮ మి యందు భీష్మనిర్యాణము. దానంజేసి యమాంతమాసగణనచే నీయష్ట మికి పూర్వము అమాంతమాసగణనంబుచే మార్గశీర్ష శు ౧౦ యందు భీష్మసందర్శనము జరిగినట్లు నిశ్చయింపనగును. మఱు సటిదివసమగు నేకాదశినుండి యించుమించుగా రథసప్తమివఱ కును భీష్మాచార్యులచే ధర్మరాజునకు సకలధర్మోపదేశముసేయఁ బడినకాలమని నిర్ణయింపవచ్చును. కురుక్షేత్రప్రదేశమున నేటి కిని గూడ నీస్థలము భీష్మశరతల్పమనుఁబేర పవిత్రతఁగను చున్నది.

ఇట్టి మహోపదేశ మఖిలభారతవర్షీయసామ్రాజ్యము నకుఁ బట్టభద్రుండైన ధర్మరాజునకు భావిపరిపాలనంబు నుద్దే శించి చేయఁబడుటంజేసి యీమహోపదేశము భారతవర్షీయ ప్రభువులకెల్లఱకును సర్వవిధములఁబవిత్రతమంబుగ నలరారుట యకాక శ్రేయస్కరమని భారతవర్షీయప్రభువులు దెలిసికొన వలయును.

శాంతిపర్వంబున నుత్తమాశ్వాసంబులు రెండు నేజగ ద్గురుమాహాత్మ్యమునుఁ బ్రకటించుటకుఁ బ్రవర్తింపు చున్నవో యట్టి భారతీయ జగద్గురుండగు శ్రీశుకుని జగద్గురుత్వపదవి యందిక్కాలమున సదాచార సాంప్రదాయసరణి నభిషిక్తుల

మైన మమ్ముల నీభూమికనుఁ బ్రార్థించిన కాశ్యపగోత్రోద్భవుండగు ప్రసాదరాయునిచేఁ బ్రకటింపఁబడిన యీశాంతి సకల జనాదరణీయమై యాతనికి నైహికాముష్మిక నిశ్శ్రేయససాధనంబగు యశంబు నొసంగుగాక.

ఇతి నారాయణస్మృతిః
జగద్గురు శ్రీకల్యాణానంద భారతీమాంతాచార్యస్వామి
శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠమ్.

19—6—33. శ్రీ సదనమ్ — గుంటూరు.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్ర
# మహాభారతము

## శాంతిపర్వము

### ప్రథమాశ్వాసము.



సంక్రామణనిపుణవి
లాసకటాక్షా నివృత్తి శ్రీ లంపటచిత్తో
ల్లాసనదక్షా వేద
వ్యాసవచోవిభవలక్ష్మీ శ్రీ హరిహరనాథా.

**మహర్షులు పాండవులం జూడ వచ్చుట.**

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లుసకల బాంధుమిత్త్రజనంబులకు నుదకకర్మం బాచరించి పాండవులు గంగాతీరంబున నశుచిత్వం బపనయించుటకయి యొక్క సమస్థలంబునం బటకుటీరసంవిధానంబు సేయించి ధృత

రాష్ట్ర విదురసర్వభరతభార్యాసమేతంబుగా నచ్చట మాస
మాత్రంబునిలిచి రట్టియెడఁ గృష్ణద్వైపాయన నారద దేవల
దేవస్థాణు కణ్వులు మొదలుగాఁ గలమునీంద్రులనేకులు
శిష్యవర్గసహితంబుగా ధర్మనందనుసందర్శనంబునకుం జను
దెంచిన సజ్జననాథుండు ప్రత్యుత్థానప్రణామపాద్యాసనాకల
నంబులను దత్కాలోచితార్చనంబులను నమ్మహాత్ములఁ
బ్రీతులం గావించి కృష్ణనిజానుజయుక్తంబుగా వారలనుపా
సించియుండ వారలు బహువిధంబులగు ప్రియవచనంబుల
నక్కురువంశసత్తము సంభావింప నారదుండమ్మహనీయద్వి
జులం గలయం గనుంగొని యక్కౌంతేయాగ్రజుతోడం
దాను గుశలప్రశ్నంబు లగుమాటలాడం గలవాఁడగుట
వారికెఱింగించి యమ్మహీపతియాననం బాలోకించి. 2

శా. గోవిందుం డనిశంబు శోభనమెదం గోరంగఁబార్థుండు ద
[1]ర్పావేశోజ్జ్వలబాహుసారమహనీయ[2]స్ఫూర్తి శోభిల్లగాం
డీవోల్లాసవిభాసియై సమరపాండిత్యంబు వాటింప సం
భావింపన్ జగమెల్లరాజ్యమిటులొప్పంబెగొంటెరాజోత్తమా

చ. భువనభయంకరంబు లగుఘోరులఁ దమ్ములతోడఁగూడ నీ
వు వెడలఁబాటు[1]లెస్సయలవృంజలముల్ వెలయించుచోట ధ
ర్మువున కొకింతయుం దొలఁగఁద్రొక్కమియొంతయు మేలు
దీనఁ గా । రవకులముఖ్య యుమ్మలిక గాంచితెచిత్తము
బ్రీతిఁ బొందెనే. 4

1. క. ర్పావేశంబున బాహు. 2 గ. ఙ, స్ఫూర్తి సంశోభి గాం.
3. జ. గొంటె. 1, చ. సేసి.

వ. అనిన విని యజ్ఞనవిభుం డమ్మునివిభున కిట్లనియె. 5

సీ. కృష్ణుండు మామీఁద గృప సేయుటయు బ్రాహ్మ
ణానుగ్రహంబున ననిలపుత్ర
పార్థులపటుబాహు బలమున మేదిని
యంతయుఁ జేకొను నట్టి దయ్యె
నైనను నతిఘోర మగునఖిలజ్ఞాతి
వధ మొనరించుట వలన నధిక
గుణుని సౌభద్రునిఁ గులభూషణంబుఁ బాం
చాలితనూజపం చకముఁ గోలు

తే. పోఁ జేసియు గెల్పు గెల్పుగ మదియ
బుద్ధిఁ గైకొన దయ్యెడు సిద్ధముఖ్య
యదియుఁ గాక వేఱొక్క ండు మదిఁ గలంచు
చున్న యది దాని నేర్పడ విన్నవింతు. 6

చ. ఘనభుజవిక్రమోన్నతుఁడు కౌరవకోటికిఁ బట్టుఁగొమ్మ మ
మ్మనిమొనఁ దూలపుచ్చినమ హాత్ముఁడు కర్ణుఁడు గొంతి
తొల్తచూ । లని యుదకప్రదానసమ యంబున నాయమ
చేత వింటి నా । తని కుదకంబు లిచ్చుటకుఁ దామముఁ
బంచుట గోరి చెప్పినన్. 7

వ. అప్పుడు దొడంగి యంతరంగంబు నిప్పులం[2]బొరఁటినట్లు
య్యెడి నక్కుంతీమహాదేవి దాను దివాకరువరంబున నప్పు
రుషవరుం బడసి పాఱవైచుటయుం బిదప నతండు ధార్త
రాష్ట్రులపాల దొరయైయుండ మాకును వారికింగలహంబు

2. గ. పొరపి-జ. బొరలి-నట్లయ్యెడి.

పుట్టిన నది మాన్పించుటకై యక్కొడుకు కడకుం జని
యేకాంతంబునం బుట్టువుదెలుపుటయు లోనయినతద్విషయ
వార్త లనుదినంబునుం జెప్పుచుండు. 8

సీ. ఆయమ దనపుత్త్రుఁ డవుట యెఱిఁగించి
 తమ్ములలోనికి రమ్ము నీవు
సావుడు నాతండు నాకుఁ గృతఘ్నత
 వాటిల్లదే కురుపతిఁ దొఱంగి
వచ్చిన నదిగాక వాసవితోడిక
 య్యంబున కితఁడోడె నన రేయతఁడు
బెరయనోండెను నను బెరసి యొండెను నేవు
 రింతియకాని నీ వెపుడు నీకుఁ

ఆ. దనయు లార్వు రనకు మనియె నద్దేవి ద
క్కనుజు లెల్లవారి కభయ మొసఁగు
మనిన నట్ల కాక యని మమ్ము నలువురఁ
బట్టెఁ గాని తెగఁడ ప్రాణములకు.

ఆ. తొల్లి తాన దాఁచెఁ దల్లి పదంపడి
యతఁడు సెప్ప వలవదనఁగ దాఁచె
నిట్లు[3]గాఁగ నెఱుఁగ[4]మేవురమును సతం
డిట్టిఁ డగుట దాన నింత వుట్టె. 10

క. ఆతఁడు దుర్యోధనునకుఁ
బ్రీతిగ జూదంబునాఁడు పెక్కాడెనుధ

---

3. క. గాన. 4. గ. మే మేవురమునతం.

గ్నేతరములు వానికి మ
చ్చేతోగతి కోపభరముఁ జెందక యుండున్. 11

ఆ. అతనిమేను కుంతి యట్టులఁ గైవడి
యరయ నేను జూచి యాత్మ నెద్ది
కారణంబొ యిట్లు గా ననుచుండుదు
నేమి సేయువాఁడ నింకఁ జెపుమ. 12

క. కౌరవులు సేయునపమతి
కారణముగఁ గోప మెత్తుఁ గర్ణునివదనాం
భోరుహముం గనుఁగొన శమ,
మారున్ నావశముగాక యంతన బుద్ధిన్. 13

ఉ. గాండివి నోర్వఁ బల్కి 1తిట్టుఁ గర్ణునిఁ జంపక వచ్చితేనిఁ ద
మ్ముండవు గావు నాకు నని మూర్ఖత సోదరఘాతి నైనక
ష్టుండ మనంబునం 2బెలుగు శోకము నెట్లు సహింతుఁ దప్పినా
తండును నేము నైన విబుధప్రకరంబును మాకు నడ్డమే. 14

వ. అని మునీంద్రు నమ్మార్తాండనందనురథచక్రంబు భూమిం
గ్రుంకుటకుం గారణం బెద్ది దాని నవ్వీరుండు పరశురాముని
చేత శప్తుండయిన తెఱంగును నెఱింగింపవలయు భువనంబుల
వర్తనంబులు నీకుం దేటపడనియవి లేవు గావున నిన్నడిగెద
నని ప్రార్థించుటయు నవ్విధంబంతయు వివరించెద వినుమని
యమ్మహీపతి కమ్మహాత్ముండిట్లనియె. 15

---

1. క. తిట్టు. 2. గ. గమురు; జ. బరఁగు.

## నారదుండు ధర్మరాజునకుఁ గర్ణుని చరిత్రంబు సెప్పుట

సీ. మునిదత్తమగుమంత్రమున గొంతి కన్నియ
నాఁడు వేడుక దివసనాథుఁ దనకుఁ
బ్రత్యక్షముగఁ జేసి పడయుటఁ దాసగ్గ
మెంపున సుతు వెలయింప దయ్యెఁ
గన్యాత్వవికలత గాకుండ నాసూర్యు
వరము గల్గుటఁ జేసి వంశవర్య
మై పొల్చు దేవరహస్య మిత్తెఱఁ గిట్లు
పాఱ వైవఁగఁబడ్డ పట్టి సూతుఁ
తే. డెత్తికొనిపోయి సూతజుం డితఁ డనంగఁ
బెరిఁగి కర్ణుండు నీనేర్పు భీములావు
నమునివిలుబల్మి యతనికిహరికిఁగలుగు
చెలిమి గని తద్దవగఁబొంపుఁ జిత్తమెరియ. 16

క. నకులసహదేవనయశా
స్త్రకళావేదిత్వమునకు జను లనురాగా
ధికులై మిమ్ముం గొనియా
డకు నాతఁడు మనసులెగిడ్చ్పడం జింతిల్లున్. 17

వ. అది తదీయస్వభావం బట్లుగాక దైవఘటనంబు నట్టిద యమాన్మాత్సర్యంబున నక్కర్ణుండు మీయెడనీసుగలవాఁడయి దుర్యోధనుం గూడికొనియెఁ బదంపడి ధనంజయుధనుర్వి

---

౧. గ. చేడ్పడం.

ద్యాతిశయం బుపలక్షించి కుంభసంభవుపాలికిం జని యేకాం
తంబునం దనకు బ్రహ్మాస్త్రంబు సాంగోపాంగంబుగా నుప
దేశింపవలయు నని యడిగి యేను సమరంబున సవ్యసాచికి
సమానుండ నగుటం గోరివచ్చితి నీవు సర్వశిష్యసమాదరుం
డవు భవత్ప్రసాదంబునం గృతాస్త్రుండనయి వెలయ వలదే
యనవుడు నద్దిననాథనందనునకు నగ్గురుం డిట్లనియె. 18

తే. వ్రతసమన్విత! భూసురవర్యుం డొండె
నిరుపమానతపఃపుణ్యనృపతి యొండెం
గాని యన్యులు బ్రహ్మాస్త్రదానమునకుం
బాత్రములుగారు నీకు నీక బాడి4గాదు.

వ. అనుటయు నట్లకాక యని నిజమందిరంబునకుం జని మఱు
నాఁడు గదలి మహేంద్రమహీధరంబున కరిగి పరశురాము
నిం గాంచి వినయంబునం బ్రణమిల్లి యేను బ్రాహ్మణుండ
భృగువంశజాతుండ నస్త్రవిద్యాపేక్ష నిన్నాశ్రయింపవచ్చితి
ననిన నమ్మునివరుండు ప్రీతుండై కర్ణుం బరిగ్రహించి పరి
శ్రమంబు సేయించుచుండె నట్టియెడ నాశ్రమపరిసరంబున
నొక్కచోట దనయంతన లాఘవాభ్యాసంబు సేయుచుండ
నొక్కమహాద్విజునిహోమధేనువువత్సం బడ్డంబువాటి బాణ
గోచరంబై మృతిం బొందినంగని యవ్విప్రుండు గోపంబున
శాపంబిచ్చిన దానం దేరు ధరణింగ్రుంగె జామదగ్న్యుండ
శపించిన తెఱంగునుం జెప్పెద నవ్వీరుం డతనికి భక్తుండై ప

---

4. చ. లేదు.

శ్రమం బాచరింప నతండు బ్రహ్మాస్త్రంబులోనుగా ననేకా
స్త్రంబు లొసంగెఁ బదంపడి యొక్కనాఁడు. 20

తే. కర్ణునుత్సంగమున మస్త । కంబుఁ జేర్చి
గురుఁడు నిద్రింప వికృతాతి । ఘోరరూప
[1]మశకమనియెడునొకకీట । మద్దిసేంద్ర
తనయు[2]క్రిందఁ దొలిచె న । త్వరముగాఁగ.

వ. అతండును గురునకు నిద్రాభంగం బగుట కోర్వక ధైర్యా
బునం గీటకృత్యంబునకోర్చి యచలుండై యుండె నెత్తురొ
ఴొండ పరఁగి పరశురాముశరీరంబు సోఁకినన మ్మహాత్ముండు
మేల్కాని రక్తం బెక్కడిదని యడిగినఁ దొడయెత్తి కీటంబుఁ
జూపి యిది దొలుచుచుండ మీ నిదుర సెడుటకుం జాలక
కదల కుండితి ననిన నమ్ముని గనుంగొనిన నక్కీటంబు. 22

క. మృతిఁ బొంది రాక్షసుండై
ఖతలంబుననుండి పలుకుఁ । గరుణాకర నీ
కతమున దారుణశాప
ప్రతిహతి వాటిల్లె నిపుడు । ప్రకృతి వడసితిన్. 23

వ. గృత్సుం డను పేరం బరఁగు నొక్కరక్కసుండ భృగుపత్ని నప
హరించి తదీయశాపంబునం గీటంబనై యుండి భవదీయవిలో
కనామృతసేకంబున సుఖినైతి నని చెప్పి నమస్కరించి నిజే
చ్ఛం జనియె రాముండు రాధేయుధైర్యంబు మనంబున
నిరూపించి యతనితోడ. 24

1. క, గ. చ. జ. 'అళక' ఆ. అలర్క. 2. క. గ. చ. క్రిందొడ

క. ఈతాల్మి లేమి బ్రాహ్మణ
జాతికి నీ వెవ్వఁడవు ని ♦ జం బనవుడు నే
సూతజుఁడ ననియె వెఱచుచు
నాతం డామునివరేణ్యుఁ ♦ డతికుపితుండై. 25

వ. నీవు బ్రాహ్మణుండనని కపటంబున మత్పరిగ్రహంబు వడసితి తత్ఫలం బనుభవింపుమని యస్త్రవిభవంబు 1వికలంబుగా శపియించెఁ గర్ణుండునుం జేయునది లేక వగచుచు వచ్చి దుర్యోధనుం గాంచి. 26

ఆ. అధిప! పరశురాము ♦ నాశ్రయించితిఁ గృతా
స్త్రుండ నైతి నన్ను ♦ భండనమున
మార్కొనంగ లేరు ♦ మఱి యిజ్జగంబున
ననుడు నతఁడు ప్రముది ♦ తాత్ముఁడయ్యె. 27

వ. ఇవి మీయన్నవోయినపోకు లిట్లు దుర్యోధనునకు ననుంగై యుండం గళింగపతియగు చిత్రాంగదుండు శుభాంగియను నిజపుత్రికి స్వయంవరమహోత్సవంబు సేయించువాఁడై చాటించిన శిశుపాలుండును నీలుండును జరాసంధుండును రుక్మియు లోనుగా రాజులనేకులు తదీయరాజధాని యగు రాజపురంబునకుం జనిరి దుర్యోధనుండును దోహలంబున సముచితచతురంగబలసమేతుండును గల్పితరథారూఢుండును గర్ణసహాయుండునునై యరిగె నట్లు గూడినభూపతులకుం దగు సంవిధానంబులాచరించి. 28

1. విఫలంబుగా.

సీ. కాళింగుఁ డాత్మీయ కన్యాస్వయంవర
కార్యంబు నడపఁ గన్యకాసఖులు
దాదులు 1పేర్చి ధరణీపతులఁ జూపి
చెప్పంగఁ జూచుచుఁ జేతఁ బుష్ప
మాలిక యొప్పఁ దక్షిణ్యవీథికి నల్ల
నడచుచోఁ గురుపతిఁ గడచి పోయె
నతఁ డల్గి యచ్చపలాక్షిఁ బోనీక కాంగి
పట్టి రథంబుపైఁ బెట్టఁ 2బనిచి
ఆ. యేఁగుచున్న రాజులెల్ల సంక్షోభించి
కూడుకొని యుదగ్రఘోరభంగిఁ
దాఁకి రవ్విభుండుఁ దలఁకక బలశౌర్య
ములఁ బొగడ్త కెక్కఁ బోరె నధిప. 29

వ. [illegible] వెండియు. 30

శా. భల్లంబుల్ పరఁగించి యుగ్రముగ భూపాలోత్తమాంగం
బుల్ లక్షల్ డొల్లం జేయుచుఁ జిత్రలాఘవము నాఁటోపంబు
దర్పంబు రా । జిల్లం గుంభిఘటారథవ్రజహయశ్రేణీపదా
తిపంక్తు ల్లాసంబులఁ జూపుమాపుచు నహార్యం
డయ్యెఁ గర్ణుండనికిన్. 31

వ. ఇవ్విధంబున నధికవిక్రముండును వీరవర్యుని శౌర్యబాహువీర్యంబు
లకు భయంబు గొని హతశేషు లయినభూపతుల వెఱచి
[illegible] నం బ్రీతుం డగుచు [illegible] రథారూఢుండు కన్యారత్నంబుఁ

1. పేర్చెం. 2. బనిచె, పెఱఁగియున్న; బనుచు బెఱఁగి యుచట.

గొని కరినగరంబున కరుగుదెంచె నప్పగ మనంబునఁ బెట్టి కొని పదంపడి జరాసంధుం డక్కమలబంధుపుత్త్రు నెక్కటి పోరికిం బిలిచినం బోయి. 32

సీ. ఎక్కటెక్కటి పోరి యుద్ధదివ్యాస్త్రసం
చయవంతుఁ డగుజరాసంధు బాణ
ధనురాదివివిధసా ధనములు దనచేతఁ
దనయస్త్రశస్త్రసంతాన మెల్ల
నాతనిచే మడి యంగ రథంబులు
డిగ్గి పెంపారెడు నగ్గలికల
నాతండుఁ దాను బా హాసంగరమునకుఁ
జొచ్చి పెనంగఁగ నొచ్చి యతని

ఆ. యంగసంధి వికల మగుటయుఁ బోరు సా
లించి యతఁడు గార వించి తనకు
మహితవిభవ మైన మాలినీనగర మీ
నధికతేజ మెసఁగ నరుగుదెంచె. 33

వ. ఈరెండవదానంబులు నీవును గొంత యెఱుంగు దిట్లు ప్రసిద్ధ బలపరాక్రముండైనకర్ణునుదీర్ణత్వంబు సెఱుచుటకునై కవచ కుండలంబులు భిక్షించి పుచ్చుకొని నాకలోకపతి నీకుహితం బాచరించె దానం జేసి ధనంజయుం డతనిం దెగటార్పంజాలె నని చెప్పి వెండియు. 34

చ. వినుము నరేంద్ర విప్రుఁ డలిగె జమదగ్నిసుతుండు శాప
మి । చ్చె నమరభర్త వంచనము సేసె వరం బని కోరి
కుంతి మా । న్చె నలుక భీష్ముఁ డర్థరథుఁ జేసె యడంచెఁ

గలంచె మదగ్రిరా! జనుచిత మాడి శౌరి విధి కె యమ్మ్యో
నరుం 1డనిఁ జంపెఁ గర్ణునిన్. 35

వ. అట్లుం గాక. 36

క. హర సురపతి యమ వరుణులుఁ
గురుకృపులును దివ్యబాణకకోటు లొసఁగుటన్
నరుశక్తి కర్ణుతేజ
స్స్ఫురణము నార్పంగఁ జాలెఁ గేజువ్వ నృపాలా. 37

వ. అనిన విని శోకవ్యాకులుండై యన్నరపతి గన్నీగొలుక
నిట్టూర్పు నిగిడించినం దత్సమీపంబున నున్నకుంతి గనుం
గొని యడ లుడుపుటకై యతనితో నిట్లనియె. 38

చ. జననముఁ 2జెప్పియేఁ దెలుపకసత్యముసుమ్మరకుంతిభాషణం
బని తనుజత్వజాతకృప కె నంబుజమిత్త్రుఁడు వల్కెనేమిటన్
గొనకొననేరఁడయ్యె నినుఁగేగూడ సుయోధనుఁబట్టి యట్టికః
ర్ణునకయి నీకు నేఁటికి మకనోవ్యథఁ బొందఁగనిట్లుపుత్త్రకా.

వ. అనుటయు నవ్వచనంబులు దనకు నసహ్యంబులైనం గటక
టంబడి యద్దేవి నాలోకించి భవదీయమంత్త్రకార్యగోపనం
బునం గాదె యింత పుట్టెనని పలికి యంత నిలువక. 40

ధర్మరాజు స్త్రీలకు రహస్యరక్షణంబు లేకుండ శపియించుట.

తే. అంగనాజనమ్ములకు ర కె హస్యరక్ష
ణంబునందలిశక్తి మ కె నంబులందుఁ

1. డటు; డిటు. 2. దెల్పి.

గలుగ కుండెడు మెల్లలో ♦ కముల నని శ
పించె నాధర్మదేవతా ♦ ప్రియసుతుండు. 41

వ. ఇట్లు మహాతేజోధనుం డగునజ్జననాథుం డట్లు శపియించి కుంతి చేసినకర్ణగోపనంబు ప్రసంగంబుగా నంతరంగంబు గృతపడినకార్యంబులదెస నిగుడం దనకతంబున మృతిఁబొందిన యుభయపక్షబంధుమిత్త్రకోటులం దలంచి యుమ్మలించి విశేషించి కర్ణుచావునకుఁ దూర వగచి విహ్వలించి వివ్వచ్చునాననం బాలోకించి యిట్లనియె. 42

క. మన కేటిరాజ్య మొండొక
జనపదమున కేఁగి భైక్ష ♦ చర్యావిధి జీ
వనము నడిపికొని యుండుద,
మనఘా యట్లయిన సుఖుల ♦ మవుదుము సుమ్మా. 43

వ. అని వెండియు. 44

సీ. జ్ఞాతుల నంపఁటఁ ♦ జంపితి మది యాత్మ
వధము కాదే రాజ ♦ వర్తనంబుఁ
గాల్పు మహింస ని ♦ క్కము దాల్మి మత్సర
వర్జన మిది వన ♦ వాసజనుల
కాగమవిహితంబు ♦ లటె యింతయొప్పునే
వనమున వసియింప ♦ వలయు వింటె
యసుఖదం బైనరా ♦ జ్యామిషంబునకుఁ గు
క్కలభంగిఁ దమలోనఁ ♦ గాటులాడి

తే. కులమునెల్లను బొలియింపఁ ♦ గుత్సితంపు
బ్రిదుకు వచ్చె నేయనువగ ♦ పాటువడఁగఁ

బ్రమద మొసఁగదు త్రైలోక్యరాజ్యమైనఁ
గానయేనొల్ల మహిమీర కైకొనుఁడు. 45

మ. ధృతరాష్ట్రుండు తనూజకీడు సమబుద్ధిం జూడ కన్నిచుఁడే
గతిఁజన్నుంజననిచ్చెఁగాని మగుడం గాఁ దివ్వఁడయ్యెన్ 1నిరా
కృతశీలుం డగునాసుయోధనుఁడు సంక్షీణంబుసేసెం గులం
బతనింజూపఁగ గోపమూఁటె మదిశోకాక్రాంతమయ్యెం దుదిన్.

వ. అర్జునుండు గర్వం బెఱుంగక దుర్మానంబు వాటించిన సైరించి తొలంగనైతి రాజ్యపరిగ్రహపరత్వంబు మచ్చిత్తంబునం గలిమిం జేసి కిల్బిషం బత్యంతంబు నాచరింపవలసెఁ బరిగ్రహదోషంబు పరిగ్రహత్యాగంబునంగాని పోదు పరిగ్రహత్యాగశీలుండు జన్మమరణదుఃఖంబులం బొరయం డని శ్రుతులు సెప్పెడు నొకనికి సకలధర్మంబులునుష్ఠింపశక్యంబగునే యపరిగ్రహం బొక్కటన శుద్ధుండ నయ్యెద మీరు భూమిపాలన పరిగ్రహతత్పరత్వంబున వర్ణాశ్రమరక్షణంబు సేయుం డేను గాననంబునకుం జని మునిజనసకాశంబున సుఖినైయుండెద ననిన విని యింద్రాంశసంజనితత్వకలిత తేజోధనుం డగునర్జునంజయుండు దనయూహ్మలత్వంబున నవ్వాక్యంబులు దుస్సహంబులైనం బదరి దరస్మితంబునఁ దద్వికారంబుఁ గప్పి యప్పుడమిఱేని కిట్లనియె. 47

అర్జునుఁడు ధర్మజున కుచితవచనంబుల మనస్తాపోపశమనంబు సేయుట.

క. ఓహో యిట్టివి గలవే
బాహాదర్పమునఁ బరులఁ బరిమార్చి తుదిన్

1. నిరాకృతశీలుం.

మాహాత్మ్యం బెడలఁగ భి
క్షాహారత నొందఁ దలఁప కగునె నరేంద్రా. 48

సీ. ధర్మపథంబున ధరణి సేకుఱిచిఁ బా
లింపక సత్త్వంబు పెంపు మాలి
విడుచుట యొప్పునే విను మిట్టు లైనము
న్నేల భూపాలుర నెల్లఁ జంపి
తడలి రాజ్యము దక్కి యడవికిఁ జనిన బే
1లందురు గాక మే లండ్రె జనులు
కిల్బిషశంక గల్గిన నశ్వమేధాది
పుణ్యకర్మంబులఁ బోదె వంశ

ఆ. ధర్మ మెడలఁ గృపణ కర్మంబుఁ గోరి త
ర్థంబు సువ్వె సకల ధర్మకారి
యొడమి లేసివాఁడ నడపీనుఁ గనునహు
షోక్తి వినమె దాని నూఁదవలదె. 49

క. సరిగా నెన్నుదు రార్యులు
దరిద్రునిం బతితునిం 2గృతఘ్నుని జడునిన్
దొరకొను ధర్మముఁ గామముఁ
బరమగతియు నర్థమునన పౌరవముఖ్యా. 50

క. కలిమియ చుట్టలఁ జేర్చుం
గలిమియ చెలులను ఘటించుఁ గలిమియ శౌర్యో
జ్జ్వలుఁ డనిపించుం గలిమియ
పలువురు సద్బుద్ధి యనఁగఁ బరఁగంజేయున్. 51

1 లందుర్రె గా కేల మే లందుర్రె. 2. కృతప్రజ్ఞులకున్.

క. ఏవానిబంధుమిత్త్రులు
జీవధనంబులును దప్పి ‡ జెందును గృశునిం
గావాని నెన్నఁగాఁ దగుఁ
గేవలతనుకార్శ్యయుతుఁడు ‡ గృశుఁడె నరేంద్రా. 52

వ. కావున నర్థోపార్జనంబును బంధుమిత్త్రపరితోషణంబును భూపతులకుం బరమపురుషార్థం బదియునుంగాక. 53

తే. జ్ఞాతినాశనమునఁ గాదె ‡ సకలదేవ
తలు ప్రవర్ధన మొందుట ‡ ధనము లడిచి
పొడిచిమొప్పనివారిచేఁ ‡ బుచ్చికొనక
యడఁగియుండంగఁజేరునే ‡ యందు ప్రబుధులు. 54

వ. వేదంబులు నిట్లు సెప్పుఁ బృథివి బలువునం గైకొని పార్థివు లర్థంబు లుపార్జించి పర్జన్యాను లగునాదిత్యుల నధ్వర క్రియాజాతంబునం బ్రీతులం జేసి యుత్తమలోకంబులు వడయుదు రిత్తెరువు వట్టి దిలీప నృగ నహుషాంబరీష మాంధాతలు నడచుట వినవె తత్పదవి నీకొదవి యున్నయదితదీయ ప్రకారంబున బహుళదక్షిణావిధానంబుగాఁ బ్రభూతంబైన యజ్ఞంబు సేయవైతేనిఁ జూవె సకిల్బిషుండవగుట యశ్వమేధంబు సేసినరాజులెల్ల నవభృథంబునం బరిపూతాత్ములగుదురని పలికిన నయ్యజాతశత్త్రుండు. 55

క. వెడవెడ యప్పలుకులు చెవి
నిడి కొండొకసేపు చింత ‡ యొనకంబునపా
ల్పడి యూరకుండి చిత్తం
బడలునఁ జిక్కువడ నిట్టు ‡ లను నర్జునుతోన్. 56

క. సేమపుఁదెరు వొక్కటి గల
దే మెచ్చితి దాని నడుగు మెయ్యది యని సు
త్రామసుత యడుగ కున్నను
నేమి వినుము చెప్పెదను ము నీంద్రుల కెక్కెన్. 57

సీ. సారహీనము లగు సంసారసుఖములు
విడిచి యేకాకినై యడవి కేఁగి
తాపసవ్యాఖ్యామృ తములు వీనులఁ గ్రోలి
చెలిమి వేర్పాటను చిరమరలకుఁ
జారకనిందాస్తుతుల్ సరిగాఁగొనుచుఁ గత్తి
నొకఁడు వేసినను వే ఱొక్కరుండు
చందనం బలఁదిన డెంద మయ్యిరువుర
యెడ సమంబుగ మూఁగజడుఁడనంగ
తే॥ మెలగి తగువేళఁ బర్ణశా లలకు నరిగి
యెత్తఁగా భిక్ష యెవ్వార లెట్టు లేమి
యిడినఁ గైకొని నాలుగే నెడల మాత్రఁ
గన్నదానఁదృప్తుండ నై యున్నమేలు.

క. అటు గాక కర్మగతిలం
పటుఁడ నగుదు నేని నల్ప 1ఫలభాగితమై
నట యిట దిరుగుచు మోక్షుని
కటవృత్తికి బాహిరుండఁ గానె కుమారా. 59

వ. కావున నాకు దొరకొన్నవిమల 2ప్రజ్ఞామృతం బనుభవిం

1. ఫలభోగమూర్తిమై, 2. జ్ఞానామృత.

పక తక్కఁడునే యిది శాశ్వతపదప్రదం బనిన విని యనిల
తనయుం డతని కి ట్లనియె. 60

క. శ్రుతివిహితకర్మజాత
స్థితియోగ్యుఁడ వైననీకుఁ । జేయఁగ వశమే
యతిలోకజ్ఞానసమ
న్వితయతిజనకృత్య మటు వి । వేకింపు మెదన్. 61

చ. అడలున రాజధర్మములయందు జనించె నసూయ నీకు ని
ప్పుడుమునునిస్పృహుండవయిపోవఁగఁగన్నఁగులంబువారుని
ప్పుడమినృపాలురుఁ బ్రదికిపోదురు నెమ్మది నట్టులైన నే
ముడుగుదు మన్త్రజీవనసముద్ధతిఁ జొత్తుము భైక్షవృత్తికిన్.

క. వాఁడి యగునలుక లోకము
పోఁడిమి సెడఁ గయ్య మట్లు । వాఁడిచి వనటమై
నేఁ డింక నడవికిం జను
వాఁడం గా కనినఁ బుడమి । వారలు నగరే. 63

సీ. పనివడి త్రవ్వి కూ । పమునందు నుదకంబు
పానంబు సేయని । వానిభంగి
యున్నతతరు వెక్కి । జున్ను సేకుఱఁ గొని
తేనియ యానని । వానిభంగి
యాఁకొని యొడఁగూర్చి । యన్నంబు తళియకు
వచ్చినఁ గుడువని । వానిభంగి
తమకించి యొకభంగిఁ । దనవశంబుగఁ జేసి
మానినిఁ గవయని । వానిభంగి

ఆ. గాదె కురువరేణ్య ఘనశక్తి శౌర్యసం
పన్ను లైనపగఱ భండనమున
నోర్చి పూజ్యరాజ్య మొల్లక యడవికి
నేఁగు టీవ యెఱుఁగు దిత్తెఱంగు. 64

క. నీ వడవి కరుగ నోడఁబడి
నీవెనుకన వచ్చునపుడు నిందింతురు మ
హిన్మావెట్టు లితని మాన్యం
గా వలఁతులు గార యని జగజ్జను లధిపా. 65

క. భోగములఁ బాపి నిందా
భాగులఁగాఁ జేసి యడవి పాల్పఱిచెదవే
నీగారవంపుఁదమ్ముల
సాగరవృతధరణిఁ గలుగు జనములు వగవన్. 66

వ. అని వెండియు. 67

క. కేవలనిష్కర్మత మో
క్షావహ మగునేని గిరులు నవనీజములుం
భూవర ముక్తిం బడయం
గా వలవదె యడవి నునికి కైవల్యదమే. 68

క. ఫలములయెడ బ్రహ్మార్పణ
కలనపరుం డగుచుఁ గార్య కర్మము నడపన్
వలయుం దత్త్వజ్ఞానము
దలకొనినం గర్మశమము దానై కలుగున్. 69

కావునం గర్మహీనత్వం బపవర్గకరంబు గా దనవుడు సర్వజ్ఞు
నుండు ధర్మనందను నుద్దేశించి దేవా యొక్కయితిహాసంబు
గల దవధరింపు మని యిట్లనియె. 70

సీ. కొందఱు బ్రాహ్మణుల్ | 1గొండుక లాత్మకు
లోచితాచారంబు | లుడిగి కాన
లకుఁ జన్న వ్రజి వా | రికిఁ గృప చేసి ప
తత్త్రిరూపమునఁ దగ | త్పౌర్వ్యమునకు
నరిగి మీఱకైకొన్న | తెరు వొప్ప దనవుడు
విని వా రఖిలమార్గ | వేది యద్భు
తాస్పద మీపక్షి | యని దాని కభిముఖు
లై సత్పథం బెద్ది | యనఘ చెపుమ
తే. యనిన2నలుగాలివానగో | వును నశేష
శబ్దములమంత్రమును లోహ | జాతిగాంచ
నమును మనుజుల విప్రుండు | సమధికత్వ
భాజనము లంద్రు వేదప్ర | పంచవిదులు. 71

వ. ఇట్లుత్తముం డైనవిప్రుం డుత్తమమంత్రోపాశ్రితంబు లగు విహితకర్మంబులు నడపుట రత్నకాంచన సాంగత్యంబునుం బోలె సంస్తుత్యం బై యుండు నాలస్యంబునం 3గ్రోధంబున శోకంబునం దదనుష్ఠానంబు విడుచుట పాతకం బజ్ఞాను లగు నర్థహీనులు సన్న్యాసకాలవివేకంబు లేక వేగిరపడి యుభయభ్రష్టు లగుదురు గృహస్థ ధర్మంబున వర్తించి యతిథి

1. గొందుఱ. 2. నలుకాలిలోన. 3. గోపంబున.

దేవ పితృ 1 సంతృప్తి సేయుచు శిష్టాన్నభోజనపరులగు పుణ్యులకుం బుణ్యలోకంబు లఱచేతిలోనివి గావె బ్రహ్మ ప్రీతం బయిన సత్కర్మకలాపంబు. మహానందంబుఁ జేయు ననుటయు. 72

క. విని వారు దెలిసి మరలం
జనిరి గృహస్థత్వధర్మ ◊ సదనుష్ఠానం
బునకు నటు లగుట సేలుము
జనవల్లభ పుడమి నడపు ◊ జన్నము లెలమిన్. 73

అని చెప్పి నప్పుడు నకులుం డన్నరనాథున కి ట్లనియె. 74

నకులుఁడు ధర్మజునకు మనస్తాపోపశమంబు సేయుట.

సీ. దేవతల్ వేదవి ◊ ధిప్రవర్తకులు బ్రా
హ్మణులును వారల ◊ యట్ల శ్రుతుల
కింకరు లై కాదె ◊ కిల్బిషంబులఁ బాసి
వారిచందమున శా ◊ శ్వతవిభూతి
నొందుట యజ్ఞాదు ◊ లుడుగుట సంపరి
త్యాగమే పాడిమై ◊ నర్థముల ను
పార్జించి దేవతా ◊ బ్రాహ్మణపూజగా
నిడుచుఁ దత్ఫలకోటి ◊ విడుపు గాక
ఆ. క్రోధశోకహర్ష ◊ కోటులు గృహముతో
విడిచి యోగ 2 మూఁది ◊ వృక్షమూల

1. పూజలు. 2. పొంది.

వాసనిరతి నుండు [1] వాఁ డొకసంపరి
త్యాగి నృపుల కది స మర్థ మగునె. 75

క. తక్కినయాఁ డాశ్రమములు
నొక్కెడ గృహస్థధర్మ మొకదెసఁ దులయం
దెక్కింప వానితో న
య్యొక్కటి సరిదూఁగె నందు రుర్వీశ బుధుల్. 76

వ. కావున గృహస్థధర్మంబ యాచరణీయం బట్లుం గాక. 77

క. జతనంబున నర్థము సం
చితముగఁ గావించి క్రతు విశేషంబుల దే
వతలం దృప్తులఁ జేయుమి
యతికిల్బిషకారి యందు రాగమవేదుల్. 78

చ. వినుమితమోహమయంబయిన విశ్వము దా వెలిఁగించు నీశ్వరుం
డన నొకరుండు వర్ణతతి నాశ్రమకోటిని వాఁడు గాదె చే
సె నిఖిలకర్మయోగసవిశేషత గల్గుటయుం దదీయక
ల్పనమతదాజ్ఞకుం దొలఁగఁ బాడియె శోకముగారణంబుగన్.

వ. హింస దోషంబు గలుగు ననుశంకకుం బని లేద వధరింపుము.

క. పరుల వధింపక యెవ్వఁడు
ధర యేలెం జెపుమ పూర్వ ధరణీశులలోఁ
బొరయరు పాపము సుగతిక
యరిగిరి వా రీవు నట్ల యగు టొప్పు నృపా. 81

1. వాఁడకొ; వాఁడొకొ.

క. రక్షి ప్రజ గోరు నిజయో
గక్షేమార్థముగ జనసు | ఖస్థితి నడపన్
దక్షుఁ డగురాజు నడప కు
పేక్షించినఁ బాప మొంద | దే కురుముఖ్యా. 82

తే. గోవులను ఘోటకంబులఁ | గుంజరముల
దాసులను బ్రీతి నిమ్మెల్ల | ధాన్యములను
గ్రామముల మందిరముల ని | ష్కముల వేడ్క
నొసఁగు తత్తత్సుపాత్రత్వ | యుక్తవిధుల. 83

వీని నిన్నింటి గిత్త వో విడిచి పోయెద ననుట నీయట్టి మహా
నుభావునకుం దగునే యని పలికినం దదనంతరంబ సహ
దేవుం డమ్మహీపతి కి ట్లనియె. 84

సీ. 1 వెలివెలి వస్తువుల్ | 2 విడిచెఁ బో నరుఁడు గ
ర్మిష్ఠతం గాదె శ | రీరయాత్ర
నడపువాఁ డది మోక్ష | ణంబు గా నేరదు
శారీరసౌఖ్యసం | సక్తి వదలి
బాహ్యపదార్థముల్ | పాటించి నిజవంశ
ధర్మముల్ వదలక | తగఁ జరింపు
మమత బంధంబు ని | ర్మమత మోక్షంబును
జేయు నింత యెఱింగి | చేసి రధిప
తే. రాజ్య మేలుమి మన్వాదు ల | రణ్యమునకు
నరిగినీవందు వలయు ద్ర | వ్యములమీఁదఁ

1. వెడవెడ వస్తువుల్. 2. వీటఁబో... గాక శరీర.

జేయవలదె మమత్వంబు । వేయు నేల
యదియు సంసారచక్రవా । హకముగాదె. 85

తే. నీవ చుట్టంబుఁ బక్కంబు । నీవ చెలియు
నీవ తల్లియుఁ దండ్రియు । నీవ గురువు
నీవ దైవంబుఁ గావున । నావిషాద
భాషణంబులు సైరింపు । భరతముఖ్య. 86

క. తథ్యము లైనను దలఁప న
తథ్యము లైనను సభక్తి । తాత్పర్యము వై
తథ్యంబుఁ బోరయకుండఁగఁ
బథ్యంబుగఁ గొనుము నాదు । పలుకులు కరుణన్.

వ. అనియె నిట్లు దమ్ము లందఱును బోధించు పలుకులు విని ధర్మనందనుం డూరక యుండె నతనియెడ సవిశేషబహుమానయు నతనిచేత సంతతోపలాలితయు 1 ధర్మాధర్మనిదర్శనశీలయు నగు పాంచాలి భద్రగజప్రతిమానులైన యప్పవమానతనయ ధనంజయ నకుల సహదేవుల మధ్యంబున యూథపతిపోలె నున్న యన్నరేంద్రు నల్లన చేరి యేనును నాయెఱింగినంత చెప్పెద నని యనుజ్ఞఁ గొని యవ్విభువదనంబున నిజవిశాలలోచన రోచులు పరఁగ వినయం బాననంబున నతిశయిల్ల.

1. ధర్మార్థనిదర్శన.

ద్రౌపది ధర్మజునకు హితవచనంబుల మనస్తాపోపశమంబు సేయుట.

సీ. శోకాగ్ని దనికిన 1 సొగయునీతమ్ముల
నుపపన్నవాక్యామృతోపయుక్తిఁ
దేర్పుము గానలం ద్రిమ్మరునాఁడు పీ
రాయాసములఁ బడు టవధరించి
సమయకాలము సన్నఁ జని సుయోధనుఁ జంపి
భోగంబులను బహు త్యాగములను
యాగంబులను సద్విహారముల్ సలుపుద
మని యూఱడింపవే యఱిగణంబుఁ

తే. ద్రుంచి రాజ్యంబు 2 సేకొంటి తొలఁగిపోదుఁ
గాకయనియిప్పు డుడికింప నీకుఁదగునె
ధర్మమును సత్యమును నుచితంబునిన్నుఁ
గడవనెఱిఁగెడువారలు గలరెయధిప. 89

వ. అని ముట్ట నాడి మఱియును. 90

క. పేదమన సగుట ధర్మువు
గాదు నరేంద్రునకు జగము గావం బ్రోవం
గాదె నృపు లోకపాలాం
శోదితుఁ గాఁ జేసెఁ బద్మయోని చతురతన్. 91

క. నరరూపంబునఁ 3 బరఁగెడు
పరదేవత గాక నృపుఁడు [illegible]

1. సొగియు, 2. సేకొని, 3. దిరిగెడు.

ప్పురుషునెడ నేమి పొమ్మని
తిరిగినదుర్మతులఁ బొంద ƒ దేకీ డధిపా. 92

ఉ. నేరక చేర నొక్కనిన ƒ నీఱుగఁ జేయుఁ గృశానుఁ డిద్ధధా
త్రీరమణాగ్ని గాల్చు నతి ƒ తీవ్రత వంశము నెల్ల నిట్లుగాఁ
గౌరవకోటి దర్పమునఁ ƒ గానక నిన్నుఁ బరాభవించి దు
ర్వారభవత్ప్ర[1] కోపశిఖిఁ ƒ గ్రాఁగె మదిన్ వగ పేల దీనికిన్.

సీ. నృపునందు విధి దండ ƒ నీతి ప్రతిష్ఠించెఁ
గావున నపరాధ ƒ గతి యెఱింగి
దండించునృపతికి ƒ రెండులోకంబులుఁ
జేకుఱు దోషంబు ƒ సేయ నుడుట
నచ్చొత్తి వెడలంగ ƒ నడుచు విప్రుని నైన
భూవరుం డిది మెచ్చు ƒ దేవకోటి
సభ కేకవస్త్ర ర ƒ జస్వల యనక నన్
దల వట్టి యీడ్చిన ƒ తప్పుఁ దనదు

తే. తొడలు సూపినతప్పును ƒ దుష్టకష్ట
తరవచనములఁ బఱచిన ƒ తప్పు ననుజు
నందు దుర్యోధనునియందు ƒ ననుఁగునందుఁ
గాంచి దండించి తిట్టిది ƒ కల్మషంబె.

క. గరదుని గృహదాహకు మం
త్రరహస్యవిభేది వధవి ƒ ధాయిఁ బరసతీ
హారు బంధుఘాతిఁ బరధన
హారణపరునిఁ జంపి పుణ్యుఁ ƒ డగు నృపుఁ డనఘా॥

1. కోపమున.

క. దండార్హులై నవారల
దండింపక యున్నఁ జువ్వె ధాత్రీవిభు నా
ఖండలసన్నిభు నైనఁ బ్ర
చండపుఁగిల్బిషము వొందు జగతీనాథా. 9

క. పేదలకును సాధులకును
వేదములకుఁ దాపసులకు వే యేల సమ
స్తాదిత్యులకును దండమ
కాదె బ్రమకుఁ జేయు రాజు గావింపంగన్. 97

వ. కావున. 98

ఆ. ఉచితదండవృత్తి నుర్వీప్రజాభిర
క్షణము నోపి చేత గాక రాజ
వంశజునకు ధర్మ వా భూసురార్హంబు
లైనశమదమాదు లాత్మ నిడుట. 99

వ. అని యంత నిలువక చనవు మెఱసి మేలంపుఁ జందంబున.

ఉ. వైదికధర్మచారి జన వత్సల నీమదిఁ బట్టుకొన్నయు
న్మాదము హీనమానవుమ నంబునఁ బుట్టినవెట్టివోలె న
స్వాదులఁ దీర్చు టొప్పుదు ని జానుజవర్గముమీఁదఁగల్గిన
త్యాదరసాంద్రసారకరుణామృతమానఁగనిమ్ము 1 నెమ్మదిన్.

వ. అని పలికి యి ట్లనియె. 102

క. నాయట్లు నడినయంగవ
లేయెడలం గలరె యిట్టి యేనును ధర్మా

1. బుద్ధికిఁ.

పాయము నీ కగు 1నను వెఱఁ
బాయన గృహధర్మ 2, వృత్తిఁ । బౌరవముఖ్యా. 103

వ. అని వెండియు. 104

క. కౌరవులు దమకుచితమునఁ
దా 3 రెరిసిరి కల్మషంబు । దానఁ గలదె భూ
భారము వహింపు బహుయ
జ్ఞారంభణ మాచరింపు । మఖిలహితముగన్. 105

క. సురగురుఁడును శుక్రుండును
బరిపాటిగ దండనీతిఁ । బలికిరి దానం
బరిణతుఁడవు నీ వనుజులు
పరికరముగ నడపు ధర్మ । భాసుర దానిన్. 106

వ. అనినం బాంచాలితో మఱుమాట లాడక యున్న యన్న
రేంద్రునకు నింద్ర నందనుం డి ట్లనియె. 107

సీ. దక్షుఁ డై భూపతి । దండనీతి నయింప
కున్న సన్న్యాసులు । నుత్పథప్ర
వర్తను లగుదురు । వారిరి నన్యోన్య
ధన ధాన్య పశు భూమి । దారహరణ
మాచరింతురు జను । లప్పాప మవ్విభు
నొందు దండము హింసకోయుఁగఁ దలంప
వలదు దుర్వృత్తుల । వధియించు రుద్రుని
గోవిందు వాసవు । గుహునిఁ జూడు

1. నని వెఱఁ 2. యుక్తి. 3. దాక చేసిరి.

తే. మామహాత్ములు దక్కు - ను ఽ న్మార్గచరుల
దండితులఁ జేతవినమెయి ఽ ధర్మమడఁగు
ధర్మ మెసఁగు దండమున న ఽ ర్థంబుఁ గామ
మునునదూష్యంబులై సిద్ధిఁ ఽ బొందునధిప.

వ. దండంబున సకలజనశ్రీరక్షణంబు సేయం బూనినభూనాథు
నక యేల యోగ్యహింసకుం దొలంగ నెట్టివారికి వశంబు
గాదవధరింపుము. 109

ఉ. కాయలఁ బండ్ల నీళులను ఽ గల్గవె సూక్ష్మపుజంతువుల్
మునుల్ । సేయరె హింస వాని 1 నుప ఽ జీవితఁ ద్రవ్వరె
కందమూలముల్ । నీయెడఁ జూడు ప్రాణములు ఽ నిల్వఁగ
నేర వహింస నేరికిన్ । వేయును నేల భక్ష్యముగ ఽ వేధ
విధింపఁడె ప్రాణిఁ బ్రాణికిన్. 110

క. విను పశుహింసాకృతయా
గనిరూఢుని ధర్మపరునిఁ ఽ గా వేదంబుల్
గొనియాడెడు సముచితహిం
సన మరయ నహింస గాన ఽ జగతీనాథా. 111

క. అరివీరుల ఘోరం బగు
దురమున వధియించు టేల ఽ దోసం బయ్యెన్
ధరణీశ పాండుపాలిత
ధరావలయ మాసపడుట ఽ దగదే నీకున్. 112

1. వానికుపజీవితఁ, వానినుపజీవిగ.

క. ఇల [1]నీచేఁ గొన్న తెఱఁగు
దలఁపఁగ ధర్మంబ కాదొ । దైవం బెఱుఁగున్
వలవనిచింత యుడిగి ధృతి
దలకొని పాలింపు యజ్ఞ । దక్షుఁడ వగుచున్. 113

క. అని పలుకుపార్థుపలుకులు
విని పలుకక యున్నమనుజ । విభుదెసఁ గోపిం
చినతనమది వెడఁ గుడుపుచు
ననిలసుతుం డిట్టులనియె । నాతనితోడన్. 114

ఉ. నీవు సమస్తధర్మపరి । నిశ్చయవేదివి నీచరిత్రమే
మే వసుధేశ వంక యని । మెచ్చక చక్కఁగ జేయువారమే
[2]నీవచనప్రపంచమున । కింకఁ జొరంజొరనంచు నుండియున్
వావిరిఁ జెప్పఁగా వలసె । వాలినదుఃఖము దాల్మిఁ గ్రాఁచినన్.

వ. అవధరింపుము. 116

క. ఒడఁగూడినసామ్రాజ్యము
నడలున దిగఁద్రావి చనిన । నఖిలజనులు నిన్
గడుఁ బేదమనసువాఁ డని
నెడ నాడుదు రనిన మము నిరసి యను టరుదే. 117

మ. కపటద్యూతమునం బరాభవము రాఁగాఁ సూనృతంబూఁది
భూ । మిష మమ్ముం జలుకంగఁ జేసి నినుఁ జేతిం బాసి
పొంచున్ దురం । తపుదుఃఖంబుల కోర్చి పోయి తదియున్

1. నీచేకొన్న. 2. యీవచనప్రపంచమున కింకఁ

ద్ధక్రీడ నప్పాపక । ర్మపుజాతిం దెగటార్చఁ జేయఁగ బ్రౌ ।
కీర్త్యౌం బడయ్యె లోకంబులన్. 118

దుర్జయు లగువిరోధుల నిర్జించి యుపార్జించినపృథివీప్రముఖ
పదార్థంబులు నిరర్థకంబులు సేసి వనంబునకుం జనుచులుకఁ
దనం బేమిటం బాపికొనువాఁడ వట్లుం గాక. 119

సీ. ఆసభలోఁ బడి । నట్టిబన్నంబును
నడవులఁ దిరిగెడు । నపుడు దుష్ట
దైత్యులచేత సైంధవునిచే [1]నొఱపులఁ
బడ్డవిషాదంబుఁ । బరమదైన్య
మున కోర్చి కొలిచి మాత్స్యునిపాలనున్నదుః
ఖంబును ద్రోహులఁగనుపుగొట్టి
వెలువరించెద నని । తలఁచి కృష్ణునినిశ్చ
యం బూఁది ధర్మంబయగుటఁ దెలిసి
తే. రణ మొనర్చితి నిను ధార్త । రాష్ట్రులొండె
నీవు వారలనొండెను । జావఁజూడ
వలయుటప్పు డెఱుఁగవే । వసుమతీశ
యిప్పు డడలుట నింద్యంబ । యింత నిజము. 120

క. పను లేము సేయఁగా దు
ర్జనులం జెఱుచుచును సాధుజనుల మనుచుచుఁ
జననాథ మహాయజ్ఞము
లొనర్చుచును వెలయు కురుకులోత్తంసమవై. 12

1. నొఁకివులఁ

వ. అనిన విని ధర్మతనయుం డిట్లనియె. 122

చ. మదమును రాగముం భయము మానము లోనగు కిల్బిషం
బులన్ । హృదయముఁ జొన్పి భూజనుల నేలుట మేలని
పల్కె దార్తికా । స్పద మని రార్య లామిషము పైతగు
లిమ్మహి నెల్ల నేలినం । దుది నరకం బొకండ నృపతుల్
సుఖులే యుపశాంతి నొప్పదే. 123

తే. కామభోగముల్ మేలనఁగాదు వాని
విడిచి చూడుము పొందెదు విపులసుఖము
కాయ లాకులు నీళ్ళును గాలి యనుభ
వించి యున్నమునీంద్రులు వెఱ్ఱివారె. 124

క. దుర్మతు లామిషగత మగు
కర్మము వాటించి బంధకలితు లగుదు ర
యూర్మి గడచి సువిచారులు
నిర్మమతేను ముక్తి వడయ నేర్తురు వత్సా. 125

వ. జనకునివచనంబులు వినమే వాని నేనుం జెప్పెద నాకర్ణిం
పుము. 126

ఆ. ఒకటిదెసను దృష్ణ యొలయదు గావున
నేమియర్థములును లేమి లేదు
కాలఁ జొచ్చె మిథిల గాలదు నాకు[1]నం
దొక్కఁడైన నింత నిక్కువంబు. 127

క. అని పలుకుజనకుఁ దెగడిరె
జను లుల్లము శాంతిఁ బొందె సంసారం బొ

1. నిం దొక్కఁ

ల్లనివాఁడు నింద కర్హుం
డని పలుకుట నీక యొప్పు । నధికవిచారా. 128
తే. వినుము ప్రజ్ఞాధిరూఢుఁడై । వనట దక్కి
సంసృతిక్లేశపరుల భూస్థలిఁ జరించు
వారి నచలంబుపై నున్న । వాఁడు సూచు
నట్లు చూచుటసూవె నే । ర్పమలహృదయ. 129

**జనకున కతనిసతికి నైనసంవాదం బర్జునుఁడు ధర్మజునికిఁ జెప్పుట.**

వ. అని పలికి మఱి పలుక కున్నయప్పుడమితేనికిం గవ్వడి యిట్లనియె. 130
క. జననాథ నీవు సెప్పిన
జనకనృపాలునకు నతివిశేషదమానస యా
తనిభార్యకు నీక్రియ న
య్యెను సంవాదంబు దాని । నేర్పడ వినుమా. 131
వ. అమ్మహీపతి పూజ్యరాజ్యంబు [1]విడిచి భిక్షావృత్తికి వెడలఁ జూచినం దదీయ భార్య యతని కిట్లనియె. 132
సీ. పుడమి యేలుట డిగ్గ । విడిచి భిక్షార్థివై
పోయిన నతిథిసం । పూజనంబు
దేవతర్పణ పితృ । దేవతర్పణములుఁ
గలుగునే కాషాయ । ములు ధరించి
ముండుఁడైనతఁ డన్న । మునకు గృహంబుల
కరుగక యున్నె గృహస్థుఁ డెల్ల

1. నొల్లక భిక్షావృత్తి వెడ.

వారికి నన్నంబు గారుణ్యమునఁ బెట్టు
నన్నదానము సేఁత యధికధర్మ

ఆ. మనుట వినమె పెట్టునతనిఁ జేయొడ్డెడు
వానిఁ దలఁప నందు వరుఁడు పెట్టు
వాఁడ యగుట నిక్కువం బింత సూడక
యిట్లు దీనవృత్తి [1]కేఁగఁ దలఁతె. 133

క. త్రైవిద్యు లగుమహాత్ములు
నీవలనన బ్రిదుకఁ దలఁప నిష్క్రియతమెయిన్
నీ విందఱఁ జెఱిచెద విది
దేవా ధర్మంబు గాదు దీని నుడుగవే. 134

తే. అధిప మీ[2]తల్లి యుల్లంబు నడలువెల్లి
ముంచి సతి శోకసంతాపమూర్తిఁ జేసి
వంశవిహితధర్మంబులు వదలి వెడలి
పోయి యేగతిఁ బొందెదవో యెఱుంగ. 135

క. [3]చలిపందిరిచందంబున
ఫలభరితంబైనతరువుభంగిఁ బ్రజలడ
ప్పులు దీర్ప నమరి యుండెడు
నలఘుచరిత్రునకు లఘుతయగునే కోర్కెన్. 136

వ. ఇది ధర్మవిరోధంబు దీన మోక్షంబు గలుగు ననుట నాకుం
జూడ సందియం బని చెప్పె ననవుడు నయ్యజాతశత్రుండు
పురుహూతపుత్రున కిట్లనియె. 137

1. నేఁగ. 2. తల్లిదండ్రుల 3. చలివిందిరి.

మ. శ్రుతివాక్యంబులు కర్మనిష్ఠ [1]వినుతింపం జూచు న్నిష్క్రియత్వం
బు స । ద్గతిఁ గావించుట యాదిఁ జెప్పు నిటు చిత్తప్రక్రి
య న్రెండుం జో । దితముల్ వానిని వింటి మన్న కలుచం
దీపించునే తత్త్వసం । గతబోధంబు సుకర్మతం గలుగు నా
కం బాత్తవీరవ్రతా. 138

తే. తత్త్వబోధంబు గలుగునతండు నన్నుఁ
దెగడనేరఁడు నీవు భ్రాతృత్వసౌహృ
దమునఁగర్మంబువిడుచుటధర్మమనిన
పలుకుప్రియము[2]జగన్మాన్యపథముగనుట. 139

సీ. వడముడియును నీవు వాయువాసవులశ
క్తులు ధరియించినదుర్జయులరు
హరికరుణాతిశయమునఁ దత్తేజంబు
మీయందుఁ దగ సంక్రమించి యుండు
మీరు సంగరశాస్త్రసారపారగులరు
గాక తత్త్వజ్ఞానఘనమతులరె
యనఁటికంబమునట్లు యనిరి నిస్సారత
సంసార మనఁగ నిస్సంప్రబుద్ధు

తే. లది ప్రసిద్ధము విను తృష్ణయడఁచి కర్మ
వృత్తి విడిచి నిరాలంబచిత్తుఁడైన
యాతఁడో సుఖి దోషదుఃఖాకరంబు
లగుధనంబులు గోరెడునతఁడొ చెప్పుమ. 140

---

1. వినిపించున్, 2, జగన్మాన్య పదము నగుట,

ఉ. ఆదటఁ బూర్వశాస్త్రములయర్థములారఁగఁ గ్రోలితత్త్వసం
వేదసుధారసంబునచవిం జరస ఖ్యముఁ బొంద నేర కి
మ్మేదిని నెందునుం దిరిగిమేలని కర్మము1చెల్లఁ జెప్పుచుం
గాదని శాంతి యొప్పనిదిగాఁ జడ నాడుదు రల్పబోధనుల్.

క. విమలజ్ఞానులు శమమును
దమమును ద్యాగంబు శాశ్వతప్రచురానం
దమునకు మూలము లండ్రు ని
జముగాఁ గైకొందు రవి ప్రసన్నవివేకుల్. 142

వ. అనిన విని దేవస్థానుం డమ్మానవపతి కిట్లనియె. 143

దేవస్థానుం డనుముని ధర్మజునకు హితోపదేశంబు సేయుట.

సీ. ధనము లుత్కృష్టంబు లనుధనంజయుమాట
పాటిగాఁ గొనుము సోపానభంగి
నున్నది మార్గంబు యోగసమారోహ
ణమునకు దాననడచి కాక
వడి నుల్కి పడ నీకు వచ్చునే ధనసంగ్ర
హంబు భోగార్థకృతంబు దుష్ట
మగుటయుఁ గలదు యజ్ఞార్థకృతంబైన
నదియ నిచ్చెన బ్రహ్మపదము నొంద
తే. యజ్ఞపరిశిష్టధనభోగమాత్మకలఁక
యుడుపు నమ్మెయి శమదమయుక్తిగలుగు

1. యూఁది.

శమము దమమును దత్త్వవి జ్ఞానదములు
గాన దక్షిణాధికయజ్ఞ కర్త వగుము. 144

చ. హరుఁడును సర్వమేధ మనుయాగమునం బ్రచురప్రకాశి
తం । బొరయఁగ వేడ్కఁ జేసె విధిపూర్వదిగీశముఖామ
రుల్ మహా । ధ్వరములఁ గాదె పేర్కొనుట ధాత్రిసధ
ర్మత నేలి యజ్ఞత। త్వరత వెలుంగరే నృపులు పార్థివ
ముఖ్య మరుత్తముఖ్యులున్. 145

వ. వినుము దివస్పతి యడుగ బృహస్పతి సన్మార్గనిర్దేశకుండై
చెప్పిన1మార్గంబు. 146

ఉ. కామముఁ గ్రోధమున్ మనసుగాడఁగఁ బాఱుట మాన్చి
యింద్రియ । స్తోమవిమార్గవర్తనము దుంచుచు నెవ్వగ
లేక రక్షణం। బేమఱ కెవ్వరిం జెనకి యించుక నొంపక
లోక మేలఁగా । నామహితాత్ము సర్వమహి మాతిశ
యంబును జెందు వాసవా. 147

వ. అనియె మఱియు నాకర్ణింపుము. 148

ఉ. కర్మము మేలు 1నావిగతకర్మము మేలన రెండు నొప్పనే
కర్మఫలంబు నర్పితముగాఁదగ నీశ్వరునందుఁ జేఁత స
ద్ధర్మము గా కనంగ 2వివిధం బగుధర్మపథంబులోనమేల్
ధార్మికవర్య యేర్పఱుపఁదా వశమే వగ బుద్ధి గుందఁగన్.

ఉ. కావున సిద్ధ్యసిద్ధుల వికారముఁ బొందక ద్రోహ మెయ్యెడ

1. వాక్యంబు నాగనునకర్మము. 2. విదితం;

న్వావిరిఁ జేయ కేలు భువనంబు భవత్కులధర్మరక్షి వై
భూవరు లిట్లు సేసి తుదిఁ బుత్త్రుల గద్దియలందు నిల్పి కా
దే వనవాసు లైరి దృఢదీప్తనిరంజనబోధసంపదన్. 150

వ. అనిన విని నిర్విణ్ణమానసుండై యున్నయన్నకు నర్జునుం
డి ట్లనియె. 151

సీ. క్షత్త్రియధర్మని ‡ ష్ఠాపరత్వంబున
సమరంబు సేసితి ‡ శస్త్రనిహతిఁ
బూతాత్ము లై రిపుల్ ‡ వోయిరి సద్గతి
కమ్మయి 1రాచకర్మ మ్మొనర్చు
విప్రున కైనను సుప్రశస్తం బది
రౌద్రం బగుట వారలకును దెల్ల
మైనను నిట్లుండు ‡ నాక్షాత్త్రనృపనీతి
దురితంబు సేయునే ‡ యొరుఁడు వెట్టఁ

ఆ. గుడువ నృపతిమాత్రకునకును గా దన్నఁ
గౌరవాన్వయాగ్ర ‡ గణ్యుఁ డైన
నీకుఁ దగునె విడువ ‡ శోకంబు వర్జిస
న్నిభముగాదె నృపుల ‡ నెమ్మనంబు. 152

వ. అట్లుం గాక. 153

ఉ. వైరివధంబు నీకును నవశ్యముఁ జేయక పోవరాని దై
వైరులకుఁ భవత్సమరవాంఛన సద్గతి కేఁగ వాలి దై

1. రాజకర్మ.

చేరె విధాతృసంఘటనఁ జింతకుఁ గారణ మేమి ధర్మవి
స్తారవిదుండ నీ వకట ధైర్యసమగ్రుఁడ వై వెలుఁగవే.

వ. రాజధర్మోపాత్తంబై భవదాయత్తం బైనపూజ్యసామ్రా
జ్యంబుఁ బరిపాలించుచుఁ బుణ్యక్రియానుష్ఠానపరుండ వగు
మని పలికిన మఱుమాట వలుక కున్న యన్న రేంద్రునకు
మునీంద్రవర్యుం డగుపారాశర్యుం డి ట్లనియె. 155

సీ. అర్జునుపలుకు సత్యంబు సమీచీన
మార్యజనంబు గృహస్థధర్మ
ముత్తమం బని చెప్పు నుర్వీశు పశుపక్షు
లాదిగా జీవుల కాశ్రయంబు
నృపులకు నది దక్కఁ దపమును దమమును
బ్రహ్మచర్యమును ధర్మములుగావు
ధనములఁ దనియుట యని కోహటించుట
ప్రజల రక్షింపమి రాజకోటి

ఆ. కరయఁ బాతకంబు లండ్రు నీ వక్కట
వేదచోదనాప్రవీణ మయిన
మనసు నేల యిట్లు మార్గవృత్తికిఁ జొర
నిచ్చె దోపి ధరణిఁ యేలు మనఘ.

క. నీ వార్యబోధితుండవు
గావే వర్ణాశ్రమ ప్రకారములు వినం
గా వలయునె ధర్మంబులు
భూవరునకు దండనీతిఁ బోలం గలవే. 157

వ. సుద్యుమ్నుం డనుధరణీశుండు దండనీతిన కాదె యపవర్గంబు వడసె ననుటయు నజాతశత్రుండా సుద్యుమ్నువృత్తాంతంబు విన వలతు నానతిమ్మనిన నమ్మహీపతి కమ్మునిపతి యిట్ల నియె. 158

పారాశర్యుండు సుద్యుమ్ను చరితంబు ధర్మజునకుఁ జెప్పుట

క. విను శంఖుండును లిఖితుం
డన నిరువురు విప్రవర్యు ƒ లన్నయుఁ దమ్ముం
డును గలరు బాహుదాతీ
రనివాసులు ధర్మతత్ప ƒ రమనోవృత్తుల్. 159

సీ. వారియాశ్రమములఁ ƒ భూరిపుష్పఫలాభి
వృద్ధి నొప్పారెడి ƒ వివిధభూరు
హంబులు గల వొక ƒ యపుడుశంఖుండు గృ
హమ్మున లేకుండ ƒ ననుజుఁ డచటి
కరిగి యందొక మ్రాని ƒ నారఁ బండినపండ్లు
గని వేడ్కమైఁగోసి ƒ కొని తినంగ
నయ్యన్న యేతెంచి ƒ యనుజ యీఫలము లె
క్కడియవి చెప్పు నావుడును వార్చి
తే. ప్రణతుఁ డై యిచ్చటివ యని ƒ పలికె లిఖితుఁ
డాతఁ డనుమతి లేక కో ƒ యంగఁ దగునె
ముచ్చిమియ కాదె యిది పాప ƒ మచ్చుపడియె
నృపతిచే దండితుండ వై ƒ సీఁగికొనుము. 160

వ. రయంబున రాజసన్నిధికిం జని భవత్కార్యం బుపన్యసించి దండించుట వేఁడు మనిపలికినం దెలిసి యట్ల కాక యని లిఖితుండు సుద్యుమ్నుఁ గానం బోయి నగరి వాకిట నిలిచినం బ్రతిహారు లమ్మహాత్మునరుగుదెంచుట యమ్మహీపతి కెఱింగించిన నతండు సంభ్రమంబున సామాత్యుండై యాసంశితవ్రతుం డున్నయెడకుం జని వినయంబు సేసి మీర లిచ్చటికి 1వేంచేసిన ప్రయోజనం బేమి యానతిండు మీచెప్పినట్ల చేసెద నని విన్నవించిన నావిప్రవర్యుం డాతని కిట్లనియె. 161

ఆ. చెప్పినట్ల యేను ‡ జేసెద నని యొడం
బడినవాఁడ వింకఁ ‡ బలుకు దిరుగఁ
గామి మఱవ కుండఁ ‡ గా నీవు వలయుఁజు
మ్మయ్య దండధార ‡ కాగ్రగణ్య. 162

వ. అని యాఁది పలికి మద్గురునియనుమతి లేక తదీయతరుఫలంబులు గోసికొని యుపయోగించితి నది మ్రుచ్చిమి మ్రుచ్చుల దండించు తెఱంగున దండించి నన్ను గత2కల్మషుం జేయుము రాజదండితునకు యమదండంబు లేదని పెద్దలు సెప్పుదురు నిన్నును దండధారణ వైకల్యకిల్బిషంబు వొరయ కుండ వలయు నని తేటపడ నాడిన నమ్మాటలకు మనంబున విషాదంబు నొంది యమ్మేదినీవరుండు భూసురవరుం బ్రార్థించి. 163

1. విజయం చేసి. 2. కిల్బిషం.

ఆ. అనఘ చరిత యిట్లు నను నియోగించుట
యుడుగు మని యమాత్యు యుతము గాఁగ
భక్తి మెఱసి యెన్ని భంగులఁ జెప్పిన
నియ్యకొనక యున్న నెట్టకేని. 164

లిఖితుండు సుద్యుమ్నునిచేత నిష్కృతకరుం డగుట.

వ. నిశ్చయించి 1సముచితదండనీతి ప్రతిశీలుం డగునన్నరపాలుం
డమ్మహాద్విజునిం గరయుగచ్ఛేదనంబున దండితుం జేసిన
నతం డతని దీవించి మగిడి చని శంఖునిం గని నికృత్తంబు
లైనహస్తంబులు సూపి సమ్యగనుభూతదండితుండ నైతి
ననిన నాతండు ప్రీతుండై. 165

తే. ధర్మమార్గ ముల్లంఘింపఁ దగదు గాన
వలసె నిష్కృతి కుల మెల్ల వెలసె నీక
తమున సురమునిపితృతర్ప ణములు సేయు
మరిగి బాహుదాపుణ్యతో యముల ననఘ. 166

వ. వినుము. 167

తే. కల్లు ద్రావుట గురుపత్నిఁ గవయుటయును
విప్రుఁ జంపుట బ్రహ్మస్వ విషయ మైన
ముచ్చిలుటయును నివి గల క్రూరజనులఁ
బ్రీతిఁ బొందుటయును మహా పాతకములు.

వ. ఇమ్మహాపాతకంబు లేనింటిలోన నెద్ది సేసిన నేజాతివాఁడును
దండనీయుండ విశేషించి తస్కరుండు శారీరదండయోగ్యుం

1 సముంచితదండ.

డు రాజదండితులు సుకృతవంతులభంగిఁ బుణ్యలోకప్రాప్తు లగుదురు నీవమ్మహారాజుచేత దండింపంబడుటం బుణ్యాత్ముండవును వంశోద్ధరణసమర్థుండవు నైతివి సంతోషింపుము పొమ్మనినం బోయి లిఖితుండు. 169

తే. బాహుదానదియందు దవ ! గాహనంబు
సేయఁ బ్రభవించె నాతని ! చేతు లపుడు
విస్మయం బంది యతఁడు వే ! వేగ వచ్చి
నన్నపాలికి మగుడఁ బ్రీ ! హర్ష మెసఁగ. 170

వ. వచ్చి యరుణకమలంబులం దెగడుతనకరంబులం జూపిన నతండు దీనికి నచ్చెరువడ నేల యిది మదీయతపోవిభవంబున దైవకృతం బైనవిశేషంబు నీవు శుచివగుట దైవంబున కెక్కె సుద్యుమ్నుండును నీపుణ్యానుష్ఠానంబున నిజపితృవర్గసహితంబుగా నిర్మలాత్ముం డయ్యె ననియె నట్లగుటఁ జేసి. 171

చ. జననుత నీవునుం దగఁ బ్ర ! జాపరిరక్షణ మాచరింపునీ
యనుజునిమాట వేదవచ ! నార్థనిరూఢము రాజనీతి దం
డనమునఁ గాని [1]యొండున నో ! డంబడ దెన్నఁడు నార్యకోటియుం | దును వగ దక్కు మేలు మిలఁ ! దుష్టిగఁ
జేయుము మేటిజన్నముల్. 172

వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 173

---

1. ముండడన మొండంబడ.

సీ. అడవుల మీ రున్న ÷ యపుడు నీతమ్ములు
వివిధమనోరథా ÷ వేశకలిత
హృదయులై యుండుదు ÷ రదయత వీరి ను
పేక్షింప కిల యేలి ÷ యెల్లభోగ
ములకును భాజనం ÷ బులఁగా నొనర్పుము
తురగమేధాదిక్రి ÷ తుప్రయుక్తిఁ
బరఁగుము వీరలు ÷ బహుయజ్ఞములు సేయు
వా రటమీఁద ని ÷ ర్ద్వంద్వవృత్తి

తే. వెడలేదవు గాక విను మేము ÷ వెఱ్ఱివార
మే మహీశ్వర నీమది ÷ మేలుగంటి
మతిథిసురపితృవిషయము ÷ నప్పు [1]తిక్క
గలిగియుండంగ నది నీకుఁ ÷ గాదు గాని. 174

ఆ. న్యాయశాస్త్ర వేది ÷ వై యింగితాకార
చేష్ట లెఱిఁగి జనుల ÷ శిష్టదుష్ట
తావిశేష మరసి ÷ దండనీతి యొనర్చు
పతికి నెల్లమేలుఁ ÷ బడయ వచ్చు. 175

క. అరి యూఱవపాలుర గొనుచుఁ
గరుణ గలిగి ప్రజలఁ దండ్రి ÷ గతి మధ్యస్థా
చరణంబునఁ బాలించుట
పరమపదముఁ జేర్చు విడుచు ÷ భయ సంశయముల్.

ఆ. ఇవ్విధంబు గాక ÷ క్రొవ్వి కామక్రోధ
కలితచిత్తవృత్తిఁ ÷ [2]దోలఁగ నడచు

1. చిక్కు. 2. గలఁగ.

పతికి నగుఁ జతుర్థ భాగంబు ప్రజ సేయు
పాపములఁ గుల ప్ర దీపచరిత. 177

చ. క్రమమున నైన శాత్రవులఁ గ్రమ్మన నైనను జావఁజేత ధ
ర్మము విను పాపకర్ములగు రాజులతోఁ దగ సంధిసేత దో
షము విభుఁడుర్వి[1]యమ్ముకొని సంగరముం దొలఁగింపఁ
గూడునే సమరజితావనీభరణ శాలితఁ బోలునె యొం
డుధర్మముల్. 178

వ. కావున. 179

క. పోరుడుగను సమకూరద
కౌరవపతి యపుడు సంధి గావింపక హిం
సారుచి నైతి ననుట యవి
చారత నృపవంశకలిత జని యగునీకున్. 180

శా. భూవిస్తారము నాక్రమించి ప్రజలం బ్రోవంగ దండింపనుం
గావన్ నేర్చి మఖక్రియల్ నడపి సం గ్రామాగ్ని కాజ్యా
హుతుల్ । గా వైరిక్షతజంబు వ్రేల్చి తనువం గక్షే
పకుం డై హాయ । గ్రీవుం డుత్తమసిద్ధిఁ బొందె రణ
ముల్ [2]గీడే నృపశ్రేణికిన్. 130

వ. సంగరంబునం జంపుటయుం జచ్చుటయును బ్రజాపరిపాలనం
బును దగిన తెఱంగున దండించుటయును నుత్తమక్షత్త్రి
ధర్మంబులు గావున హింసాశంక విడిచి యాన్వీక్షికీ త్రయీ

---

1. యామికొని 2. గీడల్.

వార్తా దండ నీతులను రాజవిద్యలయందును బ్రవీణులగు
సహాయులతోడం గూడి సర్వవ్యవహారంబులు నిర్వహింప
నిర్యాణం బనతి దూరంబగుఁ గలంక దక్కు మని పలికె
సకలలోకగ్రాహ్యవచనుండగు నమ్మహాముని యిట్లు సెప్పఁ
దెలివొందక యున్నధర్మనందనుం గనుంగొని పురందర
నందనుం డుల్లంబునం గోపంబు గదుర మొగంబునం
దోఁప నీక యుండె నప్పాండవాగ్రజుం డత్తపోధనవర్యు
వదనంబునం జూడ్కి నిలిపి నిభృతంబుగా ని ట్లనియె. 182

క. పతులు మృతులైనఁ బొగిలెడు
సతుల విలాపములు శోక సంతాపం బు
త్థితముగఁ జేయఁగ నే వసు
మతి మేలినకలుచఁ గలఁక మానునె బుద్ధిన్. 183

వ. అనుటయు నమ్మునివరుం డతని కి ట్లనియె. 184

సీ. దుఃఖంబుఁ బొమ్మని త్రోవ సుఖంబు ర
మ్మని తెచ్చికొన వశ మయ్యె వానిఁ
దొలుబామునందలి దుష్కృతంబును సుకృ
తంబు హేతువులుగఁ 1దగిలి చేయుఁ
బురుషునికాలంబు దిరములు గా వవి
పొరిఁ బొరి వచ్చుచుఁ బోవు చుండు
నర్థముల్ దుర్బుద్ధి కైనను సిద్ధించు
నగుకాలమున నార్యు లయ్యుఁ గాని

1. దాపు జేయుఁ; దగులఁ జేయుఁ

ఆ. కాల మవి ఘటింపఁ । గా నేర రనిలవ
ర్షాతపేందురుచులు । నధిపకాల
కల్పితములు మంత్ర । శిల్పౌషధంబులు
మేలుసేఁత కాల । కీలితంబు. 185

క. కమలంబులుఁ దొవలు వికా
సముఁ బొందుట లతలుఁ దరులు । సకుసుమఫల భా
వముఁ బొందుట పక్షులును మృ
గములును మదకలము లగుట । కాలకలితముల్. 186

వ. మఱియు జననమరణంబులును హానివృద్ధులును లోనుగా సకలంబును గాలాధీనంబ కావున నీకు శోకింపం బనిలేదు తొల్లి సేనజిత్తను మానవపతి శోకార్తుండై యుండి తన లోనన తెలిసి సజ్జనసన్నిధి నుపన్యసించినవాక్యంబు లాకర్ణింపుము. 187

**పారాశర్యుఁడు ధర్మజునకు సేనజిత్తువాక్యంబు లుపన్యసించుట.**

సీ. తారు గొందఱకు బా । ధకు లయి నడచుట
పరులచే బాధలఁ । బడుట గలుగు
నివి కాలభావ్యంబు । లెఱుక గల్గిన నొరుఁ
బఱచితి నొరునిచేఁ । బడితి ననుచుఁ
బురుషుండు ప్రియశోక । ములఁ బొందఁ డర్థదా
రాపత్యబాంధవ । హాని కాత్మఁ

గుండంగ నడలుట । మందబుద్ధిత్వంబు
వగఁ గీడు మానునే । వలవ దడల

తే. శోకభయకారణంబులు । లోకమున న
నేకములు దానఁ దలసూపు । శోకములకు
భయములకు బుద్ధి నెడ యీఁడు । పండితుండు
మూఢుఁ [1]డవి త్రోవ నేరండు । మునుఁగు వగల. 188

క. వినుఁడీ సుఖమును దుఃఖము
ననిత్యములు గాన వాని । యాగమకాలం
బున ముదమును శోకము మొగ
కొనమియచు మ్ముఱవు శాంతి । గోరుజనులకున్. 189

తే. మూఢతమబుద్ధు లగువారుఁ । బ్రౌఢతమవి
వేకులును సుఖు లట్టులు । గాక కొంత
ప్రజ్ఞ గలవార లైన య । ప్రతిభు లైన
జనులు దుఃఖార్తు లగుట ని । స్సంశయంబు. 190

వ. అనియె నాసేనజితుం డుదాత్తవివేకనిరూఢుం డతనివచనం
బులు విద్వదాదరణీయంబులిందలియర్థంబులు నీచిత్తంబున
నలవరింపుమువగ యుజ్జగింపుమని వెండియు. 191

తే. వర్ణముల నాశ్రమంబుల । వలను మెఱసి
యరసి చక్కని తెరువున । నరుగఁజేసి
ధరణి పాలింపు సముచిత । దండధరణ
మాచరింపుము నీ కిది । యర్హవృత్తి. 192

1. డిత్రోవ.

క. దివికిం జనినను నెవ్వని
వివిధగుణము లఖిలజనులు ॥ వినుతింతురు వాఁ
డవనీశ్వర సత్పురుషుం
డవు నని కయికొండ్రు బుద్ధి ॥ నార్యజనంబుల్. 193

వ. కావున సకలజనప్రియహితం బగు పృథ్వీపరిరక్షణంబు నీకుం గులధర్మం బై కర్తవ్యం బగుట యుఱవుగాదె యనిన యమ్మునీంద్రునకు నమ్మనుజేంద్రుం డి ట్లనియె. 194

తే. మఱవ వచ్చునె నా కభి ॥ మన్యు ద్రౌప
దేయులను గర్ణు మత్స్యభూ ॥ నాయకుండు
ద్రుపదకేనృపతియుధృష్ట కే ॥ తుండుమావ
సమునఁ బాయును రేయెట్లు ॥ శాంతిగలుగు. 195

సీ. తొడలపై నన్నిలి ॥ నిడికొని నన్నుప
లాలించు చుండు బా ॥ ల్యమున నట్టి
భీష్మునిఁ జంపితి ॥ బీభత్సుభల్లముల్
దనువు సెక్కంగ నా ॥ తఁడు శిఖండిఁ
జూచుచు నుండుటఁ ॥ జూచితి నది యుల్ల
మలమటఁ బెట్టెడి ॥ నట్లు గాక
యాభంగి నున్నప్డు ॥ డాతఁ డాద్రుపదజు
నేయమిఁ దలఁచిన ॥ నెరియు మనసు

తే. పరశురాముని నోర్చిన ॥ బల్లిదుండు
కాశిరాజకన్యకలకుఁ ॥ గాఁగఁ బుడమి

నరపతులనెల్ల గెలిచిన ǂ బిరుదు 1 గలన
నాఁటిడియ పడు టూహింప ǂ నడలుగదురు. 196

ఆ. అల్పకాలభోగ్య ǂ మైనరాజ్యమునకుఁ
గా ననల్పకీర్తి ǂ ఘనుని జరర
సింహకల్పు వంశ ǂ శేఖరజన్ముఁ దు్రిం
చితి మనంబు వగలఁ ǂ జివుక కున్నె. 197

మ. జనసంపూజ్యపదారవిందుఁ డగునాచార్యుండు శోకించి నం
దనుచో ప్పారయ వేఁడి పెద్దయు ననుంగదానమ్మి యర్థింపఁ
జా । వనివానిం గరిచావు బుద్ధి నిడి యశ్వత్థామ సచ్చె
నిజం । బని యే బొంకితి మేదినీభరణ మర్త్యాంబే గురు
ద్రోహికిన్. 198

ఆ. రాజ్యలాభలోభ ǂ రతుఁడనై కడుఁబాప
మైన బొంకుమాట ǂ లాడి గురునిఁ
గూల్ప2నేర్చినట్టి ǂ క్రూరాత్ముఁ డేగతిఁ
బోవువాఁడు సెపుమ ǂ బుధవరేణ్య. 199

క. భ్రాంతి మహాత్ముఁడు గర్ణుం
డాతనిఁ జంపించి యేలు ǂ నవనీరాజ్యం
బాతురత సేయుఁ గాక సు
ఖాతిశయము మతికి నొసఁగు ǂ నయ్యె మునీంద్రా.

చ. కడిఁదిమగంటు కుంభజుఁడుగానఁగ 3 నొడ్డినమంటవోలెను
డెడిమొనఁ జూచి చూచి యిది ǂ డెప్పరమన్నగ లేకపంచితిం

1. మగఁడు. 2. నొర్చినట్టి. 3. నొట్టినమంట

గొడుకుఁ జొరంగనిత్తె యటఁ గుఱ్ఱక్రూరత నైఁ పసుభద్రయట్లుఁ గ
వ్వడి క్రియ నేర్తురే యొరులు వల్లభుఁ డే లగు1నట్టిదుర్వికిన్

చ. 2అడలడిఁ బొందఁగాఁ దగని యట్టిది ద్రోవది మేరుకల్పులం
గొడుకుల నేవురన్ జముఁడు గొనసలందురఁ జూడనేర్తునే
పుడమి గిరీంద్రదంచకము 3పాల్పినఁ బాడఱినట్లు లున్నయ
ప్పుడఁతుక యెట్టులోర్చు గృహభారము నెమ్మది నిర్వహింపఁగన్.

క. 4 ప్రాయోపవేశమున ని
క్కాయంబు దొఱఁగుతలఁపు గదిరెడి సంతా
పాయత్తచిత్త నకటక
టా యని పోనిందు నను దృఢవ్రతయుక్తిన్. 203

వ. అని పలికి బంధుమరణశోకవ్యాకులుం డయి యున్న యన్న
రనాథవరేణ్యుతో నమ్మునినాథవరేణ్యుం డిట్లనియె. 204

ఆ. ఇట్లనంగఁ దగునె యిమ్మాయి 5 నడల నీ
యట్టి ధైర్యఘనున కగునె యనఘ
బుద్ధి సెప్ప వలసెఁ బునరుక్తభాషలఁ
జెవులు మడియఁ గూడఁ జేర్చి వినుము. 205

తే. పొదలుదఱుఁగుట కై పొడ 6 వొదవుఁబడుట
కై కడుఁ జేరుఁ బాయుట కై జనించుఁ
బొలియుటకు నై సుఖంబులఁ బొందుదుఃఖ
మొందుటకు నై పదార్థము లెందు నధిప. 206

1. కట్టిఁ దుర్వికిన్. 2. అడజడి, 3. వోయిన. 4. ప్రాయోపవేశనం
బునఁ, గాయంబుఁ 5. నడప, 6. వెముగుఁ

ఉ. మిత్రుల 1 చెయ్దులన్ సుఖము ✽ మేకొను నంటయుఁ జెం
దుదుఃఖముల్ । శత్రులచెయ్దు నంటయును ✽ సన్మతి దా
ధనమూల మంటయున్ । గోత్రవరేణ్య భోగముల ✽ కున్
ధనముల్ గరణంబు లంటయుం । జిత్రచరిత్రుఁ డైన విధి ✽
చేష్ట దొరంగిన నీటిత్రావా లగున్. 207

వ. కావున నెవ్వగ నొందం బనిలేదు. 208

ఆ. ధాత నిన్ను నేమి ✽ ధర్మంబు నడపుట
కై సృజించె దాని ✽ నాచరించి
యుండు నీవు నీక ✽ యొడయుండవే ధాత్రి
2నోదితప్రవర్త ✽ నుఁడవు గాక. 209

వ. అని పలికి యప్పారాశర్యుండు వెండియు నిట్లను విదేహరా
జగుజనకుండు వివేకపరిపాకంబు నొందక మున్నొక్క సమ
యంబున బంధువియోగంబు వాటిల్ల విషాదంబు నొంది
గృహంబు దొఱంగి వెడలువాఁ డయ్యె నట్టియెడ నతని
పాలికి నశ్మకుం డనువిప్రవర్యుండు వచ్చిన నవ్వసుమతీపతి
సముచితప్రకారంబునం బూజితుం జేసి. 210

జనకున కశ్మకుండు చెప్పిననీతి వ్యాసుఁడు ధర్మజునకుఁ జెప్పుట.

తే. అర్థములు బంధువులుఁ గల్గి ✽ నపుడు తద్వి
యోగ మైనట్టియెడను మర్త్యునకు నెద్ది

1, చేఁతలన్. 2, చోదితప్రవర్తి జాఁడవు.

తలఁపుమై నున్న మదవిషా ర్దంబు లడర
కుండఁజెప్పవె యదికృపా యుక్తి ననఘ. 211

వ. అని యడిగిన నాతం డి ట్లనియె. 212

సీ॥ దుఃఖంబు సుఖమును దోడివ సంసార
ముసకుఁ దద్వశగతిఁ బోవునరుని
యాత్మ నంబుదము గా డ్పపహరించినవిధం
బున నవి సెఱుచు నే పున సుఖైక
భాగియు దుఃఖైక భాగియు లేమి లో
కంబునం దెలియంగఁ గనుట మందు
వానికి విను జర రా నీక త్రోవంగఁ
జావక యుండ వ శంబె జలధి

తే. వలయవేష్టితక్షితి సేలు వాని కైన
నధిప యెద్ది వాటిల్లిన ననుభవించు
నపుడు ప్రాప్తవ్య మిది యని యంతరంగ
విభ్రమము లేక యునికి వి వేకసరణి. 213

క. నరవర సరసాన్నంబులుఁ
బరిమళసద్వస్తువులును బరమశయనవి
స్తరములుఁ గాలాధీనత
నరుఁ బొందుం బాయు వాని నమ్మమియ యుఱున్.

చ. వలనధికంబుగాఁగలుగు వైద్యులుశాస్త్రములభ్యసించిమ
దులనొడఁగూర్ప నేర్చితను దోషములార యుబుద్ధిగలి

ర్తులకుఁ జికిత్స సేసెదరు § రోగము వాయమి లేదె వారు రో
గు లగుట గాన మెట్లు ప్రతి § కూలవిధి నరు నేర్పు దోఁచునే.

సీ. సద్వంశజన్మంబు § సౌందర్యమును బలం
బును సుభగతయును § భోగములును
భవితవ్యతానురూ § పంబులు పేద లై
పెంచుట కలయుంగఁ § బెల్లు పుట్టు
దురు ప్రజ లెంతయు § సిరి గలవారు గో
రంగఁ బుట్టరు దరి § ద్రపుజనంబు
లాఁకటం దిని ఱాలు § నఱిగించుకొందురు
భోజ్యసంపన్నులు § భోజనంబుఁ

తే. బూర్ణముగఁ జేయఁజాలరు § భూపవర్య
వెలఁది జూదంబు పానంబు § వేఁట యతిని
1 షేవితములుగా దఁగ దని § చెప్పవినుచు
వలను గలవార చెడుదురు § వానివలన. 216

వ. అట్టివి దైవకృతంబులు కావున నిష్టానిష్టప్రాప్తులకుం గారణంబులుగ నికొనలేవు బాంధవలాభంబును దద్వియోగంబును వఱదం గాష్ఠంబులు సంగతంబు లై పదంపడి పాసినచందంబు. 217

తే. మాతృపితృదారపుత్రక § భ్రాతృశతస
హస్రకంబులు సంసృతి § ననుభవింపఁ
బడియె నిందులో నెవ్వరి § కడలువాఁడు
నరుఁడ నిత్యతయూహించు § టరయ నుఱవు. 218

1. షిద్ధములు గాన దగ వని.

క. జననజరామరణోగ్రా
హానిబిడకాలాబ్ధిమగ్న । మని జగము నెఱిం
గినవాఁడు ధర్మవర్తన
మున నుండుం జింత దక్కి । భూపవరేణ్యా. 219

క. తనయెడ లెరవని 1 నను మను
జునకును బంధుతతి సతమె । శోకించిన వ
చ్చునె చచ్చినజంతువు నె
మ్మన మధికము నొచ్చుఁ గాక । మహితవివేకా. 220

ఉ. కావున నెవ్వగల్ విడువు । గైకొను మాత్మకులార్హకర్మసం
సేవనతత్పరత్వము వి । శిష్టజనంబులసంగతిఁ భవ
ద్భావముకల్మషంబు దెగఁ । బాచి2శుచిత్వముఁబొందులోకస
భావితకీర్తి వయ్యెదు నృ । పాలక నాపలు కూఁడు3పాటిగాన్.

వ. అనుటయుం దెలిసి జనకుం డమ్మునిని నామంత్రితుం జేసి
నిజకర్మతంత్ర నిర్వాహణంబున కై గృహంబున నిలిచె నీవు
నట్ల యుమ్మలికం బుజ్జగింపుముత్తమక్షాత్త్ర సరణిసాధితం
బైన భూవలయంబుఁ బాలింపుము తక్కటితలంపులు దక్కు
మని పలికిన విని పలుక కున్నయగ్రజుం జూచి సవ్యసాచి
జనార్దనునితో ని ట్లనియె. 222

క. బహుబంధుమరణశోక
ప్రహతవివేక మయి ధర్మ । రాజునకు మనో

1. మనుమనుజానకును. 2. సుఖిత్వము. 3. పాడిగాన్.

మహిమ వికల మయ్యెం బర
మహితవచోవృత్తిఁ దేర్పు మహితవిచారా. 223

వ. అనిన నచ్యుతుండు పాండవాగ్రజుఁ జేరం జని యభివందనం బాచరించి యతని కరంబు వట్టికొని వదనంబు విరిదమ్మిచం దంబు నొంద మధురాక్షర విన్యాసంబుగా ని ట్లనియె. 224

మ. పురుషవ్యాఘ్రము మనంబు గుంద వగలం బొందంగ నీ కేలసం గర కేలిన్ భవదీయబంధు లతిలోకం బైన [1]పెంపొప్పఁబో యిరి నాకంబున కట్లు గాక కలగాదే రాజవృత్తంబు దా నరయన్ రాజుల యేల యేజనులు[2]నిత్యాయుష్యులే చెప్పుమా

వ. అని పలికి వెండియు.

తే. తొల్లి సృంజయుఁ డనుమహీవల్లభుండు
పుత్రశోకాతురత్వంబుఁ బొంది యున్న
నుపశమంబుగఁ బ్రాక్తన నృపులఁ జెప్పి
తెలిపె నిమ్మౌని యంతకు బలిమి కలిమి. 227

వ. అని యొఱంగించి నారదుం జూపి యిమ్మహాత్ముం డట్లు మరుత్తసుహోత్రాదు లగు రాజుల పరమోత్కృష్ట కర్మం బులునునట్టివారికింగాలవశత్వంబునం బొందకుండ రామియుం దెలియ నుపన్యసించిన వాక్యంబు లభిమన్యు మరణశోక వ్యాకులుండవగు నీకుం దాపోపశమంబుగాఁ గృపాతిశయం బునం బరిపాటి వీరలు సెప్పి రని పారాశర్యము నీశ్వరు నిర్దేశించి వీరి వచనంబుల యేనునుం జెప్పెద నాకర్ణింపు మని యి ట్లనియె. 228

1. తెం పొప్ప. 2. నిత్యాయుర్ధనుల్.

ధర్మరాజునకుఁ గృష్ణుఁడు షోడశరాజులచరిత్రంబులు సెప్పుట.

సీ. సంవర్తుఁ డనుమహా సంయమి దేవతా
గురుతోడియీసున నరుగుదెంచి
పూని యుపదిష్టుఁ డై నడపంగ హి
మాచలపాదంబు నందు శక్ర
వరుణ ప్రభృతులైన సురలు మహామునీం
ద్రులును సహాయులై మెలఁగుచుండ
శాలాప్రముఖభవ్య సాధనమ్ములు గన
కమయంబులుగ వస్త్రకాంచనాజ్య

ఆ. దధిపయఃఫలాది తర్పణద్రవ్యస
మృద్ధి సకలజనులు మెచ్చఁ బెక్కు
లధ్వరములు సేసె నట్టిమరుత్తుండు
నిత్యపదవి నుండ నేర్చెనయ్య. 229

సీ. సన్మార్గమున రాజ్య సంపద నొంది భూ
సురపూజ లొనరించి సువ్రతముల
బృందారకులఁ బ్రీతిఁ బొందింపఁ
దన కర్థిఁ బర్జన్యుఁ డేఁటేఁటఁ బసిఁడివాన
కనకమయము లైన కర్కటఝషనక్ర
కూర్మచయముతోడఁ గురియుచుం
నయ్యర్థ మెల్ల ధ నార్థుల కిచ్చుచుఁ
గురుజాంగలంబునఁ బరమనిష్ఠ

ఆ. నశ్వమేధముఖము లైనరాజార్హయ
జ్ఞములు పెక్కు సేసి సకలజనులు
పొగడు నట్టిపాట నెగడె సుహోత్రుఁ డ
వ్విభుఁడు దెగియె ననుట వినమె యధిప. 230

సీ. కాంచనాలంకార కాంతంబు లై రూఢి
కెక్కినగజములు పెక్కువేలు
జవసత్త్వరూపాది సకలగుణములఁ బెం
పెసఁగినహయములు నేకలక్ష
లమలినస్వర్ణమ యము లగుకొమ్ములం
గొమరారుపశువులు గోటు లూర్జి
తాంగకవిలసద జావికంబులు గణ
నాతీతములు గన్య లప్రమేయ

ఆ. లఖిలరత్నవిరచి తాభరణంబు ల
నల్పములు మహీసు రావళులకు
నిచ్చి చేసెఁ గ్రతువు లెన్నియేనియు నంగుఁ
డతఁడు నన్యలోక గతుఁడు గాఁడె. 231

సీ. ఏడుదీవులయందుఁ గ్రీడాగతులఁ దన
రథము చరింప న రాతు లనఁగ
వినియు నెఱుంగక విభవ మార్జించుచోఁ
బ్రజల నొప్పింపని పరమపుణ్యా
కర్మంబునకు మెచ్చి గౌరవంబునఁ దన
కక్షయధనము ఘా లాత్ముఁ డొసఁగ

నశ్వమేధములు జా ꣸ హ్నవిహాంత శిష్టజ
నాకీర్ణములుగఁ బె ꣸ క్కాచరించెఁ
ఆ. దారకములు వృష్టి ꣸ ధారలు లెక్కింప
వచ్చుఁ గాని యతని ꣸ యిచ్చుగోవు
లెన్నఁ గొలఁది గాదు ꣸ సన్నుతిపాత్రమా
శిబికి నుర్వ నునికి ꣸ సెల్లె నెట్లు. 232
సీ. యౌవనంబునఁ దప ꣸ మాచరింపఁగఁ దండ్రి
పంపున నరిగిన ꣸ పెంపుకలిమి
సేతువు జలధిఁ బ్రి ꣸ ఖ్యాతంబుగా నొన
ర్చినమర్త్యలోక1పా ꣸ వనవిభూతి.
త్రైలోక్యకంటకు ꣸ దశముఖు బంధుయు
క్తంబుగాఁ జంపిన ꣸ కలితనమ్ము
బాలురమరణంబు ꣸ వాటిల్ల కుండంగఁ
జేసినయత్యంత ꣸ చిత్రమహిమ
ఆ. గలిగి యశ్వమేధ ꣸ ములు మున్ను గాననే
కాధ్వరము లొనర్చి ꣸ యఖిలజనులఁ
దల్లివోలె నరసి ꣸ దశరథరాముండు
గాలవశత నొందెఁ ꣸ గాదె యధిప. 233
సీ. పూర్వవంశ్యులఁ గావఁ ꣸ బూని వియద్గంగ
నవని భాగీరథి ꣸ యనఁగఁ బఱపి
శకుంరిండు మెచ్చఁ బ ꣸ రాక్రమంబునఁ బేర్చి
యప్రతిహతముగ ꣸ నశ్వమేధ

1. పాలన.

యాగంబు లొనరించు ఽ నప్పుడు వేయువే
లరదంబులందుఁ గ ఽ న్యల నలంకృ
తలఁ జేసి యునిచి ర ఽ థంబు రథంబున
కిభములు నూఱు నూ ఽ 1ఱేసి యేనుఁ

తే. గేనుఁగునకుగుఱ్ఱములువే ఽ 2యేసిపాటి
హయముహయమునకట్లగో ఽ చయముమర్చి
భూరిభూరియుతంబుగ ఽ భూసురులకు
నొసఁగినట్టిభగీరథుం ఽ డున్నవాఁడె. 231

సీ. అర్థి విశ్వావసుం ఽ డాదిగాఁ గలుగుగం
ధర్వులు హృద్యవా ఽ దన మొనర్ప
నప్సరోనికురుంబ ఽ మాటలుఁ బాటలు
నై వినోదింపంగ ఽ నమరగణము
బహువిధాలంకార ఽ భంగుల3విన్నాణ
ములు సూప దివ్యము ఽ నులు నుతింప
మనుజలోకం బెల్లఁ ఽ గనకాన్నవస్త్రభూ
షణదానములఁ దృప్తి ఽ సనఁగ నశ్వ

ఆ. మేధసమితిఁ జేసి ఽ మెప్పించె నింద్రుని
శతతమాధ్వరమున ఽ నతఁడు హయము
నాసపడిన నిచ్చె ఽ నాదిలీపునిఁ జూపు
మా ధరిత్రి నిపుడు ఽ మనుజనాథ. 235

1. ఱేర్చి... వేయేసి వాసి. 2. వాసి. 3. విన్నాణములు.

సీ. జనన మాదిగఁ బాక ♦ శాసనుకరమునఁ
బ్రభవించునేయును ♦ బాలుఁ డావి
ద్వాదశదినము లా ♦ తఁడు గారవింపఁగ
వర్ధిల్లి పండ్రెండు ♦ వత్సరముల
ప్రాయ మై రాజ్యసం ♦ ప్రాప్తికి నేతెంచి
యర్కునియుదయంబు ♦ నస్తమయము
నగునట్లు పొలిమేర ♦ లైనమహాక్షేత్ర
మంతయు నొక్కండ ♦ యనుభవించె

ఆ. నన్నపర్వతముల ♦ నాజ్యనదుల విప్ర
భోజనము లొనర్చి ♦ రాజసూయ
ములును నశ్వమేధ ♦ ములుఁ జేసె మాంధాతృఁ
డింద నిలిచెనే న ♦ రేంద్రముఖ్య. 236

సీ. అనిమిషాసురయుద్ధ ♦ మున నసురావలి
సమయించి వర్ణాశ్ర ♦ మముల నేర్ప
రించి భూమి యలంక ♦ రించి యగ్నిష్టోమ
హయమేధవాజపే ♦ యాతిరాత్ర
పౌండరీకము లనఁ ♦ బరఁగినయధ్వరం
బు లనేకములు సేసి ♦ భూసురులకు
నఖిలభూములఁ గల ♦ యర్థంబు లెల్లను
దన కని యేమియు ♦ నునుప కిచ్చె

ఆ. శుకుఁ డనల్పుఁ డనఁగ ♦ శోభిల్లి తనయందు
ధర్మతత్త్వమూర్తి ♦ తముగ నియమ

నిష్ఠుఁడై యయాతి నెగడె శాశ్వతుఁ డయ్యె
నే నృపాల యమ్మ హీశ్వరుండు. 237

సీ. ఓర్వక పెక్కండ్రు రుర్వీశు లొక్కటఁ
బై నెత్తి వచ్చిన భండనమున
వారి హేతిచ్ఛత్ర వాహనధ్వజములు
నఱకిన నడునడ నడిఁకి వార
లభయంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి
యొచి యీపెన్నేల యెల్లఁ దాన
కొని యధ్వరములపై కొనరించి వేడుకఁ
బాయసంబులునపూ పములుమోద

ఆ. కములు లోనుగాఁగఁ గలవంటకముల ను
ర్వీసురావళులకుఁ బ్రీతిఁ జేసి
దక్షిణలుగ మహిని దానంబు లిచ్చిన
యంబరీషుఁ డేమి యయ్యెఁ జెపుమ. 238

సీ. లక్షభార్యల నుప లాలించి యొక్కొక్క
వెలఁదికి వేవురు వేవు రాత్మ
జులుగాఁగఁ బదికోటు లలఘుమూర్తులఁగాంచె
వారును దోర్బలో జ్జ్వలులునార్య
చరితులు నై పేర్చి తురగమేధంబు లం
దఱు బహుదక్షిణో దాత్తభంగిఁ

1. పెక్కులొనర్చి.

జేయుచుఁ దనపంపు సేసి వర్తింపంగఁ
దానును విశ్రుతా ధ్వరము లొప్పఁ

తే. పెంపుసొంపును సువ్రత సంపదయును
నిర్మలశ్రద్ధయును గర్మ నిపుణతయును
నెఱయ శశిబిందుఁ డొనరించి నెగడె నతఁడు
పడయఁ జాలెనె యెన్నఁడుఁ జెడనియొడలు. 239

సీ. అధికతపంబున నగ్ని నారాధించి
ప్రత్యక్ష మగుటయు బ్రహ్మచర్య
వృత్తంబుదమమును వేదవిత్త్వము నహిం
సయుఁ బాత్రదానంబు శమమువరము
గాఁ గోరికొని వేది కాస్థలి మణికన
కాత్మక మై ముప్ప దాఱుయోజ
నముల దైర్ఘ్యమునంత కమరువిస్తారంబుఁ
గలుగంగ నొనరించి క్రతువుసేసి

తే. విప్రవితతికి[1] దాని న తి ప్రియమున
నిచ్చెఁ దనపేర గయ నుతి కెక్కు వటము
పొగడు వడయంగఁ బుణ్యుఁ డై నెగడె గయుఁడు
భూవరోత్తమ యతఁ డెందుఁ బోయెఁ జెపుమ. 240

సీ. ఇరువదివేవురు పరిణతవాచకు
లభ్యాగతులకును నతిథులకును

---

1. దానమతిప్రియమున

బాటించి క్రొత్తగాఁ బవలును రేయును
వలయునన్నము లిడ వెలసె పశువు
లర్థి నుత్తమగతి కై తార చనుదేర
1విశసించు చమరులు వేడ్కతోడఁ
బొడసూపి కడుపారఁ గుడువ హవిర్భాగ
ములు వెట్టు చివ్విధం బున! మహాద్భు
తే. తముగ నొనరించె సత్క్రియా గము తదుత్స
వంబు గొనియాడ వచ్చిన వారలెల్లఁ
బ్రచురపుణ్యాత్ముఁడన నొప్పె రంతి దేవుఁ
డవ్విభునకును వలసె లో కాంతరంబు. 241

సీ. శరభసిం2హాత్యుగ్ర సత్త్వచయంబుల
నేడిక 3లెట్లట్ల యెక్కి యాడి
కట్టుచు విడుచుచుఁ గణ్వాశ్రమంబున
దమియింపఁగా సర్వ దమననామ
మిడియె నమ్మౌని పదం పడి మహారాజ్యప
దస్థుఁడై కాళింది తటమునందు
భాగీరథీతీర భాగంబునను సర
స్వతిసమీపమునను వాజిమేధ
తే. రాజసూయాదివివిధాధ్వ రము లొనర్చి
కనకనిర్మితకరితురం గమరథంబు
లసదృశప్రీతి విప్రుల కొసఁగె భరతుఁ
డన్నరేంద్రచంద్రుండును జన్నవాఁడ. 242

1 విశసించు నను... వెట్టువివ్విధ. 2. హా వ్యాఘ్ర .3 లట్టుల.

సీ. మిట్టుఁ బల్లంబు నై మెలఁగంగఁ దనరథ,
ప్రముఖవాహనములఁ బఱప ననువు
గా కున్న మేదినిఁ గని సమస్థలియుఁగ
వెరవున నొనరించి విశ్రుతముగఁ
దనపేరఁ బృథివి నాఁ జనఁ జేసి గోరూప
మైనయివ్వసుమతి నమరనగముఁ
బనిచి యోషధులును బహురత్నములు బిది
కించి జనంబుఁబో షించెఁ బృథుఁడు
తే. చేసె నానాధ్వరము లవి చెప్ప నేల
సకలధాత్రి బ్రాహ్మణులకు సత్కరించె
నమ్మహానుభావునకును నతులయశము
గాక సుస్థిర మయ్యెనే కాయ మనఘ. 243
సీ. బ్రహ్మవిద్వేషంబుఁ బరికించి కోపించి
యవిజేయుఁ డైనస హస్రబాహుఁ
బరిమార్చి నృపతులఁ దర మిడి తునుమాడె
నిరువదియొక్క 1మా ఱెల్లచోట
నందఱయేలెడు సన్నిభూములఁ దాన
యేలె ధర్మోజ్జ్వల పాలనమున
రాజ్యభోగ్యములు ధ రాసురార్హంబులు
నగునధ్వరములు పె క్కాచరించెఁ
ఆ. గశ్యపునకునిచ్చి కాశ్యపి యనుపేర
జనఁగఁ జేసె నుర్వి జామదగ్న్యుఁ

1. మాఱెల్ల.

1వినమి యీమహాత్ముఁ డును సనంతోషవి
భ్రాంతి గలిగెనేని బ్రదుక లేఁడు 244

వ. అని చెప్పినయప్పుండరీకాక్షునితోఁ బాండవాగ్రజుండు సృం
జయసుతుం డైన సువర్ణష్ఠీవిజన్మంబును వాఁడు మృతుం
డయిన విధంబును వినినది యయినను సువ్యక్తంబుగా విన
వలతుం జెప్పవే యనిన నతం డతని కిట్లను నీకు నాఁడు
కృష్ణ ద్వైపాయనుం డక్కుమారు వృత్తాంతంబు నారదు
నధీనం బగుటం జేసి తద్వ్యాపారంబు సెప్పెఁ బర్వతునిం
జెప్పండు గాని పర్వతుండును సహకారి యత్తెఱం గాకర్ణిం
పుము. 245

శ్రీకృష్ణుఁడు ధర్మజునకుఁ బర్వతనారదుల వృత్తాంతంబు సెప్పుట.

సీ. అధిప నారదుచెలి యలికొండు కప్పర్వ
తుం డిద్దఱును మహీమండలమునఁ
ద్రిమ్మరు వేడుక దివినుండి యొక్కటఁ
జనుదెంచి తమలోన సమయ మధిక
నిష్ఠమైఁ జేసిరి నిజచిత్తవృత్తు లొం
డొరులకు దాఁపక యుండువార
మటు గాక దాఁప శాపార్హత వాటిల్లఁ
గలయది యని యిట్లు గలయఁబలికి

1. వినవె.

తే. యుచితవర్తనమున నుండి యొక్కనాఁడు
సృంజయునిఁగాంచి యతఁడు విశిష్టభక్తి
నర్చనము చేసినను భవదాలయమున
ననఘ వసియింతుమే కొన్ని దినములనిరి. 246

వ. అని పలికిన నాపృథ్వీపతి ప్రియం బంది సుకుమారి యను పేరం బరఁగిన నిజనందన రావించి యిక్కన్నియ మీకుం బరిచర్య సేయ సమధానంబున నుండుండని యన్నెలంతతో నీవు దేవోపచారంబుల వీరి నారాధింపు మని నియోగించి వలయువస్తువులు సమగ్రంబులుగా సమకట్టినం బ్రీతులై యమ్మునులు సుఖం బున్న సమయంబున. 247

సీ. అల్లఁదనంబున యనువు మైకొనఁ జూచు
నడపు కాంతికి వింత తొడవు గాఁగ
వెడవెడ నూఁగారి వింతమై యేర్పడు
దేరనివళులలో నారు నిగుడ
నిట్టలు ద్రోచుచు నెలవులకలమేర
లెల్లను బిగి యెక్కి యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కు
తారకంబులఁగల్కి తనముదొడరఁ

ఆ. జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికిఁ దెలుప సృంజయుని పుత్రి మొలఁగువి
ధంబు నారదునకుఁ దగులొనర్చె. 248

క. నారదుఁడు మదనబాణా
సారము దనుఁ బొదువ ధైర్య ♦ సార మెడలి దు
ర్వారమనోవ్యథ వంతం
గూరి క్రమంబునఁ గృశాంగ ♦ కుం డయ్యె నృపా. 249

వ. అట్లు కామబాణం బడి నలంగియుఁ దనతో నుగ్గడింప సిగ్గు
వడి. 250

చ. వెనుఁబడుచి త్తవృత్తియును ♦ వెల్వెలఁబాఱెడునాననంబునై
యనిశముఁగుందుమామఁగని♦యల్లుఁడితండిటులేలవంతఁ బొం
దెనొ యనుచింత నొంది తన♦దివ్యమతిం బరికించి కాంచి కూ
డునెసమయంబుదప్పఁగఁగ♦డుంగుటిలాత్ముఁడవై తినాయెడన్

ఆ. రాచకూఁతుమీఁద ♦ రాగంబు పుట్టుట
నాఁకు జెప్పవైతి ♦ నీకు శాప
మిత్తు నమ్మృగాక్షి ♦ నీవు వరింపక
నిలువలేవు మరుఁడు ♦ బలియుఁ డగుట. 252

వ. పాణిగ్రహణానంతరంబ వానరవదనుండవగు మనవుడు నార
దుండు నీకు నాకలోకంబునకుం జనుట లేకుండెడు మని
ప్రతిశాపం బిచ్చినం బర్వతుం డచ్చోటు వాసిపోయి భూజ
నంబులు పూజింపఁ బ్రవర్తిల్లు చుండె. 253

శా. శాపప్రాప్తికినోర్చి తా నడిగి యా ♦ చంద్రాస్యనన్నారదుం
డాపృథ్వీపతియీఁబ్రియంబునవివా♦హంబయ్యెనమ్మాత్రలో
భూపా యమ్మునివానరాననతమైఁ ♦ బొల్పె దనకాంత త
ద్రూపప్రాప్తివిరక్తగాకతగఁబ్రీ♦తుం జేయుచుండెం బతిన్.

వ. ఇట్లు పతివ్రతయై సుకుమారి నారదు నారాధించుచుండెఁ బదంపడి యొక్కనాఁడే మేనియుం బనికి వనంబునకు నారదుండు వోయినయెడం బర్వతుండు డప్పాటు గాంచి నమస్కరించి నా కిచ్చినశాపంబు మరల్పవే యనుటయు నారదుండు నీవుగావే మున్ను శపియించినవాఁడవు ముందర మరల్పం దగు నని పలికిన నతండట్ల కాక యనియె నివ్విధం బున నొడంబడి యిరువురు నొండొరువులశాపంబులు మరల్చి రయ్యల్లుండును మామతోడన వచ్చి మందిర ప్రవేశంబు సేయు సమయంబున నా రాజనందన నిజపురుషుం జూచి పరపురుషుండ కాఁదలంచి మఱి చూడక మాఱుమొగంబు వెట్టికొని పోవుటయు. 255

ఆ. నగుచుఁ బర్వతుండు నాతి నీపతి యగు
విశ్వసింపు మని సవిస్తరముగ
శాపములును మోక్షసంవిధానములును
జెప్పి తీర్చె దాని చిత్తవృత్తి. 256

వ. ఇట్లు నారదుండును బర్వతుండును బరస్పర ప్రియకారులైరి కౌరవోత్తమా నీయడిగిన సువర్ణష్ఠీవివృత్తాంతంబు ని మ్మౌని వరుండు దేటపడం జెప్పెడునని సృంజయ పుత్రచరిత్రకథనంబు నారదు కృత్యంబుగాఁ బలుకుచుఁ నతనిం జూపిన నాతం డిప్పుడు శౌరి చెప్పినంతయు నిట్టిద యక్కుమారు తెఱంగు జెప్పెద నాకర్ణింపు మని యప్పాండవాగ్రజున కభిముఖుండై యి ట్లనియె. 257

సీ. అవ్విధంబున నేను ౯ నల్లుండు సంప్రీతి
సృంజయుపాల వ ౯ సింపఁ గొన్ని
సంవత్సరంబులు ౯ సనినఁ దదాశ్రిత
బ్రాహ్మణోత్తములసం ౯ ప్రార్థనంబు
గలుగంగ మాకును ౯ గమనేచ్ఛ పుట్టంగ
నారాజునకు నుప ౯ కార మొకటి
సేయఁ దలంచి యే ౯ మాయనసన్నిధి
కరిగి కోరుము వర ౯ మంటి మనిన

ఆ. నతఁడు మీరు ప్రీతు ౯ 1 లయినకంటెను నొండు
గలవె వరము లనిన ౯ గారవించి
యనిమిషులను మిగులు ౯ తనయునిఁ బడయంగ
వలచియుండు దట్టి ౯ వానిఁ గనుము. 258

వ. అంటి మట్టియెడ నింద్రతేజోరక్షణాయత్తచిత్తుం డగు నప్ప ర్వతుం డప్పుడమితేనితో విను మక్కుమారుండు దీర్ఘాయు రుపేతుండుగాకుండు ననియె దానికినమ్మానవపతియుమ్మలించి యమ్మహాత్మునాననంబునం జూడ్కినిలిపి యి ల్లీల యుష్మ దనుగ్రహం బనూనంబు గా వలవదే యని ప్రార్థించిన నమ్మాటకమ్ముని మఱుమాట వలుకక యున్న నే నన్నరనాథు పైఁ గలుగు కరుణావిశేషంబున. 259

తే. వలదు శంకింప నింద్రుని ౯ వలనఁ బుట్టు
నెడరు వొందక యుండంగఁ ౯ గొడుకు నోపి

---

లయినంతకంటెను, గలవె.

నంత గావుము గావంగ ని నైనచావు
నపుడు నన్నుఁ దలంపు మే నది మరల్తు. 260

వ. అక్కుమారుండు నిజనిష్ఠీవనాదులు సువర్ణమయంబు లగుటం
జేసి సువర్ణష్ఠీవియనం బరఁగుఁ బ్రమోదంబునం బొందుము.

క. అని యూఱడిల్లఁ బలికిన
విని యాతఁడు సంతసంబు ని వెల్లిం దేలెం
జని యే మీప్సితవర్తన
మున నుండితి మవ్విభుఁడు ని పుత్త్రునిఁ గాంచెన్. 262

వ. వాఁడును మలమూత్రలాలాశ్రుస్వేదంబులు గనకమయంబు
లయి తొరుఁగం బెరుఁగు చుండె నాసమయంబున వేచి వెం
గలు లగుద్రుముచ్చు లబ్బాలుం బట్టినోరం జీర దఱిగి యడ
వికిం గొనిపోయి మొదలు జల్లించి పసిండి గానక పీనుంగు
నైచి పోయిరి సృంజయుండును దనకొడుకు నింద్రుం డపహ
రించె ననుతలంపున శోకార్తి నొంది పలవించుచు నన్నుం
దలంచినం బోయి నీకుం బుండరీకాక్షుం డిప్పుడు సెప్పిన
యాదిరాజవిషయంబు లగు శోకోపశమనవచనంబులు సెప్పి
యంకిలి దేర్చి యవిచారు లగు తస్కరు లాశిశువుం జంపుట
యెఱింగించి. 263

క. ద్రుముచ్చులమూఢత్వమునం
జచ్చి నరక వాసమునకుఁ ని జనినతనయు నేఁ
దెచ్చి మగుడంగ వే నీ
కిచ్చెద వగ పుడుగు మింక ని నేనియు నధిపా. 264

వ. అని చెప్పి యేనును. 265

మ్రుచ్చులచేఁ జచ్చిన సువర్ణష్ఠీవి నారదువలనఁ బునర్జీవితుఁ డగుట.

క. భావమున నమ్మొయికిఁ దగు
దీవన యిచ్చుటయు నరుగుదెంచె సువర్ణ
ష్ఠీవి గగు నద్భుతమ్ముగ
నావిభుఁడుఁ బ్రమోదసంభృతాత్ముం డయ్యెన్. 266
తే. అతని వీడ్కొని సంప్రీతి నరుగుచుండి
యింద్రుచేతఁ గాదిది విను మిక్కుమారుఁ
జంప నింద్రుండు వేచుర క్షణము మఱవ
వలదు నీ వని చెప్పితి వసుమతీశ. 267
వ. ఏను బోయినకొండొక కాలంబునకు నాఖండలుం డక్కుమారుండు దన్ను మిగులు నని శంకించి చంపింపం దలంచి నన్నుం బర్వతునిం దలంచి పుయిలోడి బృహస్పతితో విచారించిన నతం డతనిభయం బుడిపె నతండును దివ్యం బగుట సబుద్ధికం బైన వజ్రంబు నాలోకించి నీవు శార్దూలరూపంబున సృంజయసుతుం డగు సువర్ణష్ఠీవిం జంపు మనుటయు నప్పని పూని యది ననుసమయంబున. 268

సీ. సృంజయుం డుజ్జ్వల శ్రీసముల్లాసప్ర
హర్ష మొప్పంగఁ బ్రియాంగనలును
దానుఁ గుమారయుక్తముగ భాగీరథీ
తీరకాంతార ప్రదేశనిత్య
వసనేచ్ఛ మెయి నుండి కుసుమాపచయముఖ
బహువిధకేళిత త్పరత నొంది

గొందుదలంపు లేక కుండ నద్దంభోళి
వాచన నయ్యెడఁ గాంచి నిలిచి

తే. తెలుపిగాంచిశార్దూలమై యుఱికివార
ణేంద్రసమయాను నయ్యాన వేంద్రతనయు
వ్రచ్చియతర్పితంబయ్యెఁ జచ్చెవాఁడు
దాది[1]యాక్రోశమునయార్త నాదమెసఁగ. 269

క. విని సృంజయుండును బ్రియా
జనములు వేపాఱుదెంచి చచ్చినబాలుం
గని బహులశోకపూరం
బున మునిఁగిరి విప్రలాప ములు పెల్లెసఁగన్. 270

ఆ. అట్టియవసరమున నమ్మహీపతి నన్నుఁ
దలఁచె నప్పు డేను బలవిరోధి
మది విరోధ ముడిపి మసలక వచ్చియ
బ్బాలుప్రాణ మెత్తి ప్రమద మెసఁగ. 271

వ. ఉచితసల్లాపంబుల నించుకసేపు నిలిచి యన్నరపతి యను
మతి సేయ నరిగితి సువర్ణష్ఠీవియుం దండ్రికి సంతసం బెసంగు
తెఱంగునం బ్రవర్తిల్లి యతనిపిమ్మటం బృథ్వీభారంబు
పూని శిష్టానుగ్రహదుష్టనిగ్రహంబులు నడపుచు జన్నం
బులు సేయుచు శతాధిక సహస్రవర్షంబులు రాజ్యంబు
సేసె నని చెప్పి నారదుండు వెండియు. 272

---

1. యాక్రోశనార్తనాదంబు సెలఁగ.

చ. హరియుఁ బరాశరాత్మజుఁడు నాదరణాతిశయంబునన్ సవి
స్తరత నుపన్యసించినవ చక్ర ప్రకరంబు మహార్థగాథ మి
ప్ప రమహితోపదేశములు పాటిగఁ బట్టి 1 వసుంధరాధురా
ధరణ మొనర్పు మయ్యెడ ను దాత్తయశంబును ధర్మ
వృద్ధియున్. 273

వ. అనిన నజాతశత్రుం డూరక యున్నఁ బరాశరపుత్త్రుండు పరను
కరుణావిధేయచిత్తుండై యతని నుద్దేశించి. 274

సీ. క్షత్త్రియులకుఁ బ్రజా సంరక్షఁ గడచిన
ధర్మంబు గలుగునే దానివలన
వేదసంచోదిత విప్రకర్మంబులు
లెస్స లయ్యెడు నవి లేక యున్నఁ
జెడియెడు లె స్సైనఁ జెడినను రాజున
కగుఁ బుణ్యపాపంబు లగ్గలములు
గాన 2జనాభిర క్షణ మొనరింపుము
నావుడు నన్నర నాథుఁ డిట్లు

తే. మీరు సెప్పంగ నుగియాట మేలె రాజ్య
కాంక్షమిగిలి యేఁజంపంగఁ గానియట్టి
వారిఁ బలువురఁ జంపిన క్రూరతావి
శేష మాత్మ దహించుటఁ జేసి కాక. 275

వ. అనిన విని యమ్మునిపతి యమ్మహీపతి కి ట్లనియె. 276

చ. మనుజులు సేయ నెవ్వరు సమస్తము నీశ్వరునాజ్ఞఁ జెల్లెడు
న్వినుము కుఠారపాణి తరు నీరుహముల్ నఱకంగఁ బాప

---

1. మహావసుంధరా. 2. ప్రజాభిరక్షణ.

మొం । దనఁగాఁ గుఠారముఁ జనులుఽదోసముఁ బొందరు
కర్త యీశ్వరుం । డనియెడినిశ్చయంబు దృఢ ఽ మై మది
నిల్చినఁ జాలు భూవరా. 277

వ. కర్మఫలం బీశ్వరునియందియ తదర్పణబుద్ధిసహితంబుగాఁ బ్రబుద్ధులు వేదచోదిత కర్మంబు లనుష్ఠింతురు. 278

తే. ఒప్పకున్నను నాత్మకు ఽ లోక్తకర్మ
మూర్ధ్వగతిఁ జేర్చుఁ బరకర్మ ఽ మొప్పనేని
నార్యజనములు గిల్బిష ఽ మండ్రు దానిఁ
గాన నడపుము నిజవంశ ఽ కర్మ మధిప. 279

క. అగివధము పాప మని మది,
మెరమెర గలిగినను దగిన ఽ మెయిఁ జేయుము భూ
వర ప్రాయశ్చిత్తము గృహ
1ధుర యుడుగుట మేలె కీడు ఽ తోఁ 2జన నగునే.

వ. అనుటయుఁ గాంతేయాగ్రజుండు సాత్యవతేయు నానసం బాలోకించి పుత్రులుం బౌత్రులు నన్నలుం దమ్ములు జనకులుం దాతలు మామలు గురువులు సంబంధులు సఖులు నల్లురు బావలు మఱఁదులు మఱియుఁ బవిత్రులగు ధాత్రీపతులు నాచేత మడిసిరి తదీయస్త్రీజనంబులు పతి సుత సోదర పితృమరణశోకసంతాపాతిశయంబునం బల వించి పలవించి ప్రాణంబులు విడుతురు గావున దాని సూక్ష్మంబుగా విచారించి [illegible]



1. ధుర ముడుగుట; 2. జా నగు [illegible]

బాటిల్లు నెయ్యది కడగా నిష్కల్మషుండ నగుదు ననుచు[1] వెగ
డున మునింగినమనంబు మహీంభరణంబున కెట్లు సొచ్చ్చె
నుగ్రంబైన తపంబునం దనువు దొఱంగుటదక్క నొండు
విధంబు నాకుం జూడలే కున్నయది యనిన విని యమ్ము
నీశ్వరుండు నిజబుద్ధి నిపుణంబుగా నిరూపించి యన్నరపతి
కిట్లనియె. 281

సీ. విడువు ముమ్మలికంబు ♦ వినుము నీచెప్పిన
యందఱు భూముల ♦ కాసపడియుఁ
బెంపును దేజంబుఁ బేరును గోరియు
నీసున సమరంబు ♦ సేసి చచ్చి
రాపని కిల్బిషం ♦ బగునె నీ కట్లును
గాక వారల నెట్టికర్మగతులు
మృతులఁ గావించెనో ♦ మతి నెఱుంగుదె వాని
నెఱుఁగుఁ గాలుఁడుచావ ♦ నేరికేర్ది
తే. తఱి యతం డప్పు డెగటార్చు ♦ దాని నీవు
సేసినాఁడవుగా మదిఁ ♦ జింత సొనిపి
యుడుకుటాక వెట్టిదీనిపై ♦ నొల్లగృహము
విడుతుఁ గాకను టిదిపెద్ద ♦ వెట్టి యధిప. 282

క. నేర్పరి పెక్కువిధంబుల
నార్పఁగ బొమ్మలు గడంగి ♦ యాడెడుచందం
బేర్పడఁ గాన్పుము కాలస
మర్పితకార్యకరు లైనమానవులదెసఁ. 283

1. వెడంగున.

వ. నీకుం బాపంబునకుం బని లేదు పని గా కుండుం గాక. 284

క. [1]ఇచ్చఁ గృపకల్మియొప్పదె
చచ్చిననరపతులయేలు ◊ జనపదములు నీ
విచ్చెదవుగాక మనమునఁ
బొచ్చెము లేక తగ వారి ◊ పుత్త్రుల కధిపా. 285

ఆ. కొడుకు లేనిచోటఁ ◊ గూఁతుఁ బ్రతిష్ఠింపు,
దానఁజేసి వారి ◊ తల్లు లధిక
హర్ష మొందుదురు ప్రి ◊ యంబును నీ కగుఁ
బుణ్యమునుయశంబుఁ ◊ బొందునిన్ను.

మ. అనుమానింపకు తోడఁబుట్టువులు గా◊రాతున్మి తూఁటాడె
నం। దును[2]గ్రొన్నెత్తురు లేఱులై పఱవ నిం◊ద్రుం డుగ్ర
తర ద్దైత్యులన్। మును లవ్వీరు భజింపరే క్రతువులా◊
మోదంబుతో నమ్మహా। త్మునిఁ జేయింపరె యూర్ధ్వలోక
మది గా◊దో యేలఁడో నాకమున్. 287

శా. నీవున్ ధర్మవిరోధు లైన జనతా◊నింద్యాత్ముల్లం బుణ్యమా
ర్గావష్టంభము దేజరిల్ల నృపవం ◊ శాచార మొప్పారఁ దో
డై వీరానుజు లుల్లసిల్లఁగ మహో◊గ్రాజిం దెగం జూచి తా
దేవాధీశుఁడపోలె శిష్టపరిష ◊ త్సేవ్యుండ వై తాపనిన్. 288

ఆ. వలయునేని యధిప ◊ వాసవుచాడ్పునఁ
గ్రతుపరుండ వగుము ◊ రాజధర్మ

---

1. ఇచ్చకృప. 2. గ్రొన్నెత్తురుటేఱు లై.

కలిత మైనపుడమిఁ గై కొమ్ము తొలిదొలి
యశ్వమేధయాగ మాచరింపు. 289

వ. అనిన విని యంకిలి దేఱిన డెందంబుతో ధర్మనందనుం డెట్టి కర్మంబులు పాపంబు లేపాపంబున కెద్ది ప్రాయశ్చిత్తంబు మునీంద్రా యెఱింగింపవే యనుటయు నతనికి నమ్మహాత్ముం డిట్లనియె.

కృష్ణద్వైపాయనుఁడు ధర్మజునకు ధర్మాధర్మంబు లెఱింగించుట.

ఆ. ఆగమోక్తకర్మ మాచరింపమియు ని
షిద్ధ మైనదానిఁ జేయుటయును
బ్రాహ్మజనులు ధరణిఁ బాలవరేణ్యా చె
ప్పుదురు పాపములుగ బోధ్యతతికి. 291

వ. ఇది కల్మషసామాన్య నిర్దేశంబు విశేషంబు వినుము.

సీ. ఆదిత్యునుదయాస్త [1]మయకాలముల నిద్రఁ
బొందుటయును బాత్రభూతుఁ డింటి
కరుగుదెంచినఁ బూజ యాచరింపమియును
బరదారగమనంబు గురుల కెదురు
సేఁతయు గ్రామంబు సెఱుచుటయును వేద
విక్రియంబును రస విక్రయంబు
భృత్యుఁ బ్రోవమియు నాసత్యోపచారంబు
గహనదాహము నన్యకర్మకృతియుఁ

1. మగుకాలముల.

తే. దనదుకర్మంబు విడుచుట ÷ యును వృథాప
శుప్రహరణంబు మేదినీ ÷ సురులకలిమిఁ
గొనుటయును శరణార్థిఁ జే ÷ కొనమివిప్ర
వధయుఁ బాపంబు లందురు ÷ బుధజనములు. 293

వ. పాపంబులుంబోలె నుండియు దూష్యంబులు గానివానిం
జెప్పెద నాకర్ణింపుము. 294

క. దురమునఁ గైదువుఁ గొని తనుఁ
బొరిగొన నేతెంచునట్టి ÷ పురుషుని వేదాం
తరహస్య వేది నయినను
బొరిగొనినను గిల్బిషంబు ÷ వొందదు వత్సా. 295

క. ధరణీసురవిత్తము నప
హరింపఁగాఁ గని వధించు ÷ నతఁడు దురితముం
బొరయఁడు శోకయించుకయు నని
నరేంద్ర చెప్పుదురు ధర్మ ÷ నానార్థవిదుల్. 296

క. జీవితసంశయవేళను
భూవర యొం డన్న పానకములు దొరకమిఁ గల్
దాగినఁ గల్లగు లెఱుఁగక
తాగిన నద్దురిత మధికధర్మమునఁ జెడున్. 297

క. గురుసంరక్షణమునకును
బరమాపద మైనయెడను ÷ బ్రాహ్మణధనముల్
విరహితములుగాఁ బెఱచోఁ
జొరఁగా నగు మిచ్చిమికి వసుమతీనాథా. 298

తే. ప్రాణహాని దప్పించుచోఁ బరిణయంబు
నందు గురుజనకార్యార్థ మయ్యునంగ
నాజనముతోడిసంభాషణమున సర్వ
ధనముఁ జెడియెడు నెడబొంకఁ జనునృపాల. 299

క. కలలోనఁ జరమధాతు
స్ఖలనము గలిగినను బ్రహ్మచర్యము సెడ దు
జ్జ్వలవహ్ని నేయి వేల్చినఁ
దొలఁగుం గిల్బిషము దురితదూరచరిత్రా. 300

ఆ. అన్న పతితుఁడైన నటుగాక సన్న్యాసి
యయ్యెనేనిఁ దమ్ముఁడాతఁ డుండ
దారసంగ్రహంబు దాఁ జేసి పాపంబుఁ
బొరయఁ డండ్రు బుధులు కురువరేణ్య. 301

తే. అడవి గోవులకై కాల్చుటధ్వరమునఁ
బశువుఁ జంపుటయును దానపాత్రభూతుఁ
డగు టెఱుంగక యిచ్చుట దగనిబంటుఁ
బ్రోవకుండుట 1గీడులు గావు వత్స. 302

వ. తపంబుల దానంబుల మఱియునుం దగినపుణ్యకర్మంబులనుం బాపంబులు పరిక్షీణంబు లగుననునివి సామాన్యవచనంబులు ప్రాయశ్చిత్తవిశేషంబు లెఱింగించెద.

1. గీడులు:

## వ్యాసుఁడు ధర్మజునకుఁ బ్రాయశ్చిత్తవిశేషంబు లెఱిఁగించుట.

సీ. వినుము కర్మము దెల్పెదను కపాలంబున
నెత్తినభైక్ష్యాన్నమే మేకకాల
మశనంబు గొనుచు ఖట్వాంగచిహ్నము బ్రహ్మ
చర్యంబునై యధశ్శయనసమాచ
రించుచు నిల్లు పుత్రదారసువర్గంబులు
వ్రతవృత్తి నడపంగ బ్రహ్మహత్య
కిల్బిషంబు దొఱంగుఁ గృచ్ఛ్రముల్ నడపిన
నాఱువత్సరముల నడఁగు మూఁడు

తే. హాయనంబులు నడపఁ జాంద్రాయణములఁ
బోవు నిష్ఠానిరతి మాసభోజి యైన
నబ్దమునఁ బాయు నటు గాక యశ్వమేధ
యాజి యగునేని వలదు భైక్ష్యాదు లధిప.

క. అవనీశ యశ్వమేధము
నవభృథమున నీరఁ గ్రుంకి యన్యుఁడు శుద్ధుం
డవుఁ బాపుఁడైనఁ దత్క-
ర్త విశేషము లోకపూజితం బగు టరుదే. 305

తే. పుష్టగోలక్ష యొండెఁ గాంభోజవాజి
శతక మొండెను భూసురతతికి నొసఁగఁ
బాయు బ్రాహ్మణార్థాహవప్రాణహాని
యైన. నొండెను జెడు బ్రహ్మహత్యకీడు. 303

సీ. కల్లు ద్రావినపాత కం బడి యగ్నివ
ర్ణము గాఁగఁ గాఁచి పానంబు సేయఁ
గను 1మారి యుఱుకఁగనలంబుఁ జొర మహా
ప్రస్థాన మాచరింపఁగఁ బాయు
నట్లును గాక బృహస్పతిసవన మ
న్క్రతు వొనరించిన నతివిశిష్ట
భూమిదానమునను బోవు నక్క ద్గురు
తల్పగుం డనలప్రవిష్టుఁ డైన

ఆ. యాయసాంగనాంగ మాలింగనము సేసి
మైనఁ గోసి కరము నందు మేహ
నము ధరించి యంబ రముఁ జూచుచరిగియో
నియును జచ్చియఘము నిస్తరించు. 307

క. గురుతల్పగుండు రణమున
గురునకునై చచ్చియేని గురువర ధరణీ
సురులకు సర్వధనము భ
క్తి రతి నొసఁగి యేనిఁ బాతకిత్వముఁ దొఱఁగున్. 308

క. ధరణీసురుస్వర్ణము నప
హరించినతఁ డంతకనక మట్టిద వినయో
త్తరుఁడై మగుడఁగ నిచ్చినఁ
బరిహృత మగుఁ గల్మషంబు పౌరవముఖ్యా. 309

---

1. మాసి.

క. అనృతోపచారకలనం
బునఁ బుట్టినపాతకంబు వోవుం దానె
వ్వని నపచరించెఁ దగ నా
తనిఁ బ్రీతుం జేయ ధర్మతత్త్వప్రవణా. 310

క. గురువునకు మాఱు వల్కుటఁ
బొరసినకల్మషము వాసి పోవు నతనికిం
బరితోషముగా వినయపు
వెరవున నుపహార మిచ్చి వినతుం డయినన్. 311

క. పరదారగమనదోషము
పరిహృత మగు నొక్కయేఁడు పరమనియతుఁడై
చరియించినఁ గృచ్ఛ్రంబులు
గురుకులజలనిధిశశాంక గుణమణినికరా. 312

ఆ. వావి గానియట్టి వనితఁ బొందినపాప
మాఱునెలలఁ [1]బాయు నార్ద్రవస్త్ర
ధరణభస్మశయనపరతఁ బాటించుచు
నియతి నుండె నేని నృపవరేణ్య. 313

క. పరపురుషసంగమంబునఁ
బరిహృతమై యున్నయట్టిభామిని శుద్ధిం
బొరయు రజస్వలమై కం
చరయఁగ భస్మమున శుద్ధ మైనవిధమునన్. 314

1. సాఱు.

ఆ. నఱికఁ దగనిమ్రాను నఱికిన దిర్యగ్వ
ధంబుఁ జేసినను న ఘంబుఁ బాచి
కొనునరుండు మూఁడుదినములు దనచేత
పలుకుచును సమీర భక్షుఁడయిన. 315

వ. అని చెప్పి వెండియు. 316

క. మితభోజియై వివిక్త
క్షితి సావిత్రీజపంబు సేయు టది యహః
స్థితియు 1 నిశాసీనత్వము
మతి నేమఱ కట్టులైన మాను నఘంబుల్. 317

తే. పుణ్యకర్మముల్ సేయుచుభూసురులకు
వివిధధనములు ప్రీతితో వినయ మొప్ప
నొసఁగుచుండెడువారు పూర్వోపచితము
లైనకిల్బిషములఁ బాతు రవనినాథ. 318

క. విను మాస్తికతాశ్రద్ధా
వినయంబులు గలుగువారుపీనికి నెల్లన్
జననాథ యుష్ణ్యలవి లే
నినరులు పాపములఁ దొలఁగనేర్తురె యెట్లున్. 319

వ. ఆస్తికతాశ్రద్ధావినయంబులు నీకు సహజంబులు గావే
కావునఁ బ్రాయశ్చిత్తంబు లల్పంబు లైననుం బాపంబులం
బాపనోపుఁ బాపంబోయని శంకించుకర్మంబును భారత
యోధవధంబ కాదె యది యాత్మరక్షణంబునకై చేయుటం

1. నిశానసత్వము.

జేసియు నుత్తమ క్షత్త్రధర్మం బగుట నిరూపింపం 1 బాప
త్వంబుం బొరయకున్న యది యట్లుం గాక భవదంతఃకరణం
బున జనియించిన కరుణయుం బశ్చాత్తాపంబును నిన్నుం
బరిశుద్ధునిం జేసె నీవు ప్రాణబాధకంబు లగు తపశ్చరణంబు
లకుం జొరం జూడకుము కురుకులచూడామణిత్వంబునకు
మూలం బయిన మహీపాలనం బాచరింపు మనిన నబ్బాద
రాయణుతో నమ్మేదినీరమణుం డపేయంబులు నభోజ్యం
బులు నెయ్యవి యపాత్రభూతపురుషు లెట్టివారు మహా
పుషా యెఱింగింపవే యని యడిగిన నతం డిట్లనియె. 320

క. తురగియు నుష్ట్రియు ఖరియును
గురిసినదుగ్ధములు నింద్య గోటిగణితముల్
ధరణీసురాదిజను ల
ప్పొరువునఁ బోయిన నఘుంబుఁ బొందుదు రధిపా.

సీ. మానుషీక్షీరంబు నీనినపదినాళ్ల
లోని ధేనువులపా లును నపేయ
ములు ప్రేతవిషయాన్న మును సూతకాన్నంబుఁ
దలవరియన్నంబుఁ గులటయన్న
మును వనితోపజీ వనశీలునన్నంబు
నాడెదుపాడెదు నట్టిఘాని
యన్నంబు జూదరి యన్నంబు 2సూనరి
యన్నంబు బహివెట్టి నతనియన్న

---

1. బాపత్వంబునంబొరయు. 2. సూరన్యాయుంబునుబహి.

ఆ. మును నిజాగ్రజునకు మును పెండ్లియాడిన
పురుషునన్నమును న భోజ్య మండ్రు
వందియన్న మధిక నిందాస్పదంబు ప
ర్యుషితశుష్కములను నుడుగ వలయు. 322

క. విను సురతోఁ గూడఁగఁ దె
చ్చినయట్టిది యెద్దియును భు జింప రభోజ్య
త్వనిరూపణనిపుణత గల
మనుజోత్తము లఖిలలోక మాన్యచరిత్రా. 323

క. పులగముఁ బాయస మట్టులుఁ
బలలము నర్చనకుఁ [1]గాక పక్వము లయినం
గలుగు నభోజ్యత్వము వి
చ్చలవిడి వంటకము సేసి చనదు భుజింపన్. 324

వ. అని వెండియు. 325

తే. అతిథిపితృదేవతాపూజ లాచరించి
కాని గృహమేధులకు భోజ్య మైనఁ గుడువఁ
దగదు యజ్ఞశిష్టం బమృ తంబు గాఁగ
నార్యజనములు సెప్పుదు రధిపవర్య. 326

క. ఆలును బిడ్డలు బంధులు
నై లీలఁ జరించుచును గృ హస్థుఁడు దత్త
త్స్నాలత్వరహితచిత్తత
మేలుగ నలవఱుప వలయు మీఁదెఱిఁగి నృపా. 327

1. గాఁగఁబక్వ...గలుగును భోజ్యత్వము.

వ. కావున. 332

చ. అనఘు యనేకదోష మగు ♦ నట్టిమహీవహనంబు నొల్ల దం
డన పరుషత్వ మేటికి దృ♦ఢప్రశమంబున నేను గానకుం
జనియెద నన్న భీష్ముఁ డిది♦జాడ్యము గాక నృపాలధర్మమే
మనుజవరేణ్య నీమనము♦మార్దవ మగ్గల మిట్టు లొప్పునే.

వ. నిన్నొత్తి చెప్పుటకుఁ బాండువిచిత్రవీర్యశంతను లున్నవారే
నాబుద్ధి వినుము.

ఆ. ఈఁగకాలియంత♦యేనియు వీసర
పోవ కుండ ధర్మ♦మునన నడచి
రయ్య దొంటిరాజు ♦ లక్రోధకామప్ర
యుక్తదండధరణ ♦ మొప్పఁగాక. 335

క. దానాధ్యయనయజనముల
తో నుర్వీజనులఁ గావఁ ♦ దొడఁగుట పతికిం
దా నజకల్పితధర్మము
దీనివిడుపు నరకమునకుఁ ♦ దెరువగు నధిపా. 336

క. కావున వర్ణాశ్రమముల
నేవిధమున నైన నడపు ♦ లెడలక యుండం
గావంగ నోపునృపతికి
లే వలజ భృభయలోక ♦ లీలలయందుక్. 337

తే. ఇ ట్లగుటం దెలుపునది యొక్క యితిహాసంబు గల దాక
ర్ణింపుము. 338

— కేకయరాజ రాక్షస సంవాదప్రకారము —

క. పరమ నియతిమైఁ గేకయ
నరపతి యధ్యయనవిధి యొ నర్పఁగ నటవీ
పరిసరమున కేఁగినయెడ
ధరణీశ్వర పట్టె నొక్క దానవుఁ డతనిన్. 339

వ. పట్టినఁ బ్రబలుం డగునద్దనుజునిం బ్రోచిపోవంజాలక యమ్మ
హీపాలుండు వాని కిట్లనియె. 340

సీ. ప్రముచ్ఛిమియును అంకు నెచ్చోటనైన నా
భూమిలోపల లేదు భూమిసురులు
వేదాధ్యయనయజ్ఞ విధిదానతత్పరుల్
రాజులు బ్రాహ్మణా రాధనంబు
జన్నముల్ సేఁతయు సమరానివర్తన
వ్రతమును గలరు గో రక్షణాది
వార్తావినీతులై వైశ్యులు నడపుదు
రమ్మూఁడుజాతుల కధికభక్తి

తే. తోడ శుశ్రూష సేసి శూ ద్రులు చరింతు
రేమిరంధ్రంబు గాంచి నీ విట్లువెరవు
మాలి పట్టి తత్క్రూరత లీల నన్నుఁ
దలఁప నిది నీకుఁ బథ్యమే దానవేంద్ర. 341

చ. అనుటయు నమ్మహాదనుజుఁ డాతని కిట్లను నట్టివానిఁ గా
నినుఁ గని వర్ణరక్షణము నిర్మలచిత్తతఁ జేయురాజు కీ
డునఁ బడ కున్కి దెల్పఁగఁ గోడుం బ్రియమై చను దెంచి

తిఁ మహీ। జనపరిరక్ష యస్ఖలిత ♦ సౌమ్యత నిట్లు యొనర్పు
భూవరా. 342

వ. అని పలికి సఖ్యంబు చేసి చనియె నని చెప్పినం గాంగేయా
గ్రజుండు సంతోషించి జీవనాభావం బైనచో క్షత్త్రియ
కర్మానుష్ఠానంబునకు నశక్తుం డగు విప్రుం డెట్లు బ్రదుకువాఁ
డని యడిగిన భీష్ముం డిట్లనియె. 343

చ. మనఁ జను నుప్పు నువ్వులును ♦ మాంసము గోవు వృషం
బుఁ గూడుఁ గ। ల్లును ఘృత తైల మాక్షికములుఁ ధృత
కేశర మైనజంతువుల్। ధన మధికంబుగాఁ బడయు ♦ దానికి
నేనియు విక్రయింపఁ గా। దనుమతి యూఁది వైశ్యకృతి ♦
నైనను విప్రున కాపదాగతిఁ. 344

వ. అనిన విని ధర్మతనయుండు యజ్ఞంబు లెట్లయిన సమీచీనం
బులగునని యడిగిన ననిమిషనదీనందనుం డతని కిట్లనియె.

ఆ. శ్రద్ధవలయు మిథ్య ♦ చనదు వేదంబుల
బరిభవింపఁ దగదు ♦ భవ్యయజ్ఞ
కర్త కెపుడు నదియుఁ ♦ గాక దక్షిణలు మం
త్రార్థపోషకంబు ♦ లందు రధిప.

క. ఈగతి యెఱింగి చేసిన
యాగము సోమాప్తుఁజేయు ♦ నప్పురుషునిఁ ద
ద్యోగ మొనర్చు మహాసుఖ
యోగము సోమాధిరాజ్య ♦ యుక్తము శ్రుతులన్.

ఆ. అధ్వరంబుకంటె ♦ నధికంబు దపము ద
పం బనంగ మేని ♦ ప్రస్నుఁదనము

నిపురఁ జేఁతగా ద | హింసయు సత్యవా
క్యంబు దమము దయయుఁ | గాని యరయ.

వ. అనిన. 349

చ. ప్రియమున ధర్మనందనుఁడు | భీష్మునితో నృపుఁ డెట్టిభంగి
వా॥ నియెడఁ గంబు నమ్మఁ దగు | నిక్కపుమిత్త్రుఁడు లేని
భర్తకున్॥ నయగతి సెల్ల నేర దని | నన్ విని యిట్లను నాతఁ
డేకబు॥ ద్ధియుతుఁడ వై విన్ వలయుఁ | దెల్లముగా నెఱిఁ
గింతు భూవరా. 350

క. నమ్మమి మృత్యువు పెద్దయు
నమ్మట యపమృత్యు వగుట | నరపతి 1మిత్రున్
నమ్మి పనులు గొనునది ని
త్యమ్మను సూక్ష్మమతిఁ దాను | నరయఁగవలయున్.

తే. తనకు మేలొనరించు నా | తండు మిత్త్రుఁ
డతఁడునడపంగ నెల్లకార్యములు శుభము
నొందు నేమిట నేమఱ | కునికితోడ
నృపుఁడు మిత్త్రుపైఁ గార్యముల్ | నిలుపవలయు.

ఉ. మన్ననకున్ మదింప కవ | మానము వచ్చిన స్రుక్క కొక్కభం
గి న్నెఱిఁ గార్యముల్ విగత | కిల్బిషుఁడై తగ జేయునట్టిమి
త్త్రు న్నరనాయకుండు దన | రూపు2గ నగ్గల మైనప్రీయు
న.॥ త్యున్నతియున్ ఘటించు మహి | మోజ్జ్వలుఁ జేత
సుఖావహం బగున్. 353

1. నమ్మి నమ్మక పని. 2. నగ్గల మైన.

క. విను మట్టిమంత్రి గామం
బునఁ గ్రోధంబునను లోభ ౯ మున భయమునఁ గా
ర్యనిరూపణంబు వదలక
వినీతుఁ డై నడచు టధిక ౯ విభవముఁ జేయున్. 354

వ. అని చెప్పి వెండియు. 355

క. అన్నలుఁ దమ్ములుఁ గలుగుట
యున్నతుఁ జేయు నృపు నెంత ౯ యొఱపిళ్ళయిఖర్జ
మన్ననయు నీగియును సం
పన్నంబులు గాఁగ వారిఁ ౯ బాటించు టురున్. 356

వ. అది యె ట్లంటేని. 357

క. బలఁగము గలభూపాలుఁడు
గెలనిమహీశ్వరులబుద్ధి ౯ కిని వేఁగఁ గగుచుఁ
బలియుఁ డగు లేనివానిం
జులుకంగాఁ జూతు రెట్టి ౯ శూరుం డై నన్. 358

క. ఎక్కువతక్కువమాటలు
నుక్కువములు బంది గీడు ౯ లొందించుటలుం
జెక్కు దనయన్నదమ్ముల
దిక్కున నన్నియును సైఁపఁ ౯ దేజము సేయున్. 359

క. లోపల 1రాఁజుచుఁ బొగయుచుఁ
బాపంబులు దలఁతురోపి ౯ బలిమియు 2వెఱపుం
జూపక తక్కరు కెలనికి
నేపాటను వారి నడపు ౯ కొంతయు నొప్పున్. 360

1. రాయుచుఁ బొగలుచుఁ 2. వెరవుం.

తే. చాలుదురు వారు నృపతికి ౯ మేలుసేయఁ
గీడొనర్పంగఁ గావునఁ ౯ గిల్బిషములఁ
బొరయకుండంగ వారల ౯ నరసికొనుచుఁ
బొదివి నడపుటకార్యంబు ౯ భూవిభునకు. 361
వ. అనుటయు ధర్మజుండు ధనార్జనం బేమిటం బ్రస్ఫుటం బై
నడచు నని యడిగిన నతనికి భీష్ముం డి ట్లనియె. 362

కాలకవృక్షీయక్షేమదర్శిసంవాదప్రకారము.

క. ఆయతికాఁడు వలయు నర
నాయకునకు వాని కెల్ల ౯ నరులుం జేటుం
జేయఁ దలంతురు దా నవ
ధాయకుఁ డై కావ వలయు ౯ ధరణిపుఁ డతనిన్. 363
వ. ఈయర్థంబున నితిహాసంబుగల దాకర్ణింపుము కాలకవృక్షీయ
నామధేయుం డగునొక్కముని క్షేమదర్శియనియెడు కోసల
భూవిభునిభూమికిం బంజరస్థంబుఁ జేసికొని యొక్కకాకంబుఁ
దెచ్చి యిప్పక్షి త్రైకాల్యవేది యని యెల్లజనంబులకుం
జెప్పుచుం దిరిగి క్రమంబున రాజుం గని యతని కక్కా
కంబుఁ జూపి నీయందర్థార్జనాదినృపకార్యంబులవలన నేమ
ఱుట గలదు దానం బుట్టినసేగియెల్ల నిప్పులుఁగు సెప్పి
నీకుం దప్పినభ్రముచ్చులం బట్టింపఁ జాలు ననుపలుకు వలికి
యమ్మహీవరునాదరంబు వడసి పీడుఁబట్టున కరిగిన. 364
క. ఆరాత్రి యవ్విభునియధి
కారులు సంపిరొకభంగిఁ ౯ గాకము మఱునాఁ

డారాజున కవ్విప్రుఁడు
గోరి రహస్యంబుఁ జేసి కొని యెఱిఁగించెన్. 365

వ. అట్లు నియోగుల కపటోపాయంబునం గాక వృతం బగుట సాభిజ్ఞానంబుగా నెఱింగించి తనపేరుసెప్పి యేను మీతండ్రి సఖుండ నతనిపిమ్మట నిచ్చట నిలువ నొల్లక వనంబున కరిగి తపంబు సేయుచుండి నీమీఁది యధిక స్నేహంబునం జేసి నీదగు యోగక్షేమంబు లరయ వేఁడి వచ్చి యీ రాష్ట్రంబునం బురంబునను వర్తించుచు భవదీయ రాజ్యలక్ష్మి మధురభంగి యయ్యును నధములగునా నియుక్తులవలనం జోరజన సంవృతం బైన కావేరియుంబోలె నుపయోగ గాకునికి యెఱింగి నీ కెఱింగించుటకై మిథ్యాభివర్ణితం బైన కాకంబు నెపం బిడి చొచ్చితి దుర్మతు లైన ద్రోహులు దానిం జంపుటకతంబున లోనం గీడు గలుగుట నీకుం గొంత గాన నయ్యెఁ గను గలిగి యురసిన నింకనుం దేటపడియెడు నా యాప్తియును గార్యవివేకంబు కలిమియు నమ్మి మదీయోపదేశంబు నాదరింపు మిప్పుడు నన్నాదరింపక విడిచిన వాఁడ వగుము వంచకు లైన యధికారపురుషులకు నేర్పుమైఁ గ్రమంబునఁ బరస్పర విరోధంబుఁ గలిగించి సంప్రీతి సెఱిచి నీవలసిన ట్లొకనొకని దండింపు మని వారలం బేరు గ్రుచ్చి యుపదేశించిన. 366

క. ఆరాజు నట్లు చేసి మ
హారాజ్యస్థితికి నెల్ల నవ్విప్రు మహా

దారగుణు మంత్రిఁ గొని
సారధనప్రీతిసుఖయ శంబులు వడసెన్. 367

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు మంత్రి యెట్టివాఁడు గావలయు నెఱింగింపు మనుటయు గాంగేయుం డతని కిట్లనియె.

సీ. జ్ఞానపరుఁడుఁ బౌర జానపదాప్తుండుఁ
గార్యజ్ఞుఁడును ధైర్య శౌర్యఘనుఁడు
నక్రూరుఁడును విశు ద్ధాత్ముండుఁ బతియెడ
భక్త్యనురాగసంభ్రమము లెసఁగ
సమసుఖదుఃఖుఁ డై చెమరు నెత్తురుగాఁగఁ
దలఁచుచు 1నరయక తప్పుమిగాఁదఁ
బెట్టిన నలుకమైఁ దిట్టినఁ గలఁక దా
నొందక తేర్చుచోఁ బొందుసెడక

తే. మెలఁగువాఁడును నిజరంధ్ర ములకు మాటు
సేయఁ బరరంధ్రములు గని చిక్కువఱుపఁ
జాలునిపుణుండు నైనవి శాలబుద్ధి
గావలయు మంత్రిముఖ్యుండు కౌరవేంద్ర. 369

వ. అని చెప్పి. 370

క. మృదుమధుర వాక్యముల నిం
పొదవెడు చిఱునవ్వుతోడ నుర్వీశుఁడు స
మ్మదము సచివులకుఁ బ్రజలకు
నొదవింపఁగ వలయు నది మ హోన్నతిఁ జేయున్.

1. నలయక.

తే. ఈఁగియును బ్రియవచన సం యోగమునన
కాని జనులకు సంతోష కారి కాదు
పుచ్చికొనునప్పు పల్కుల పొందుకలిమి
యెదిరిమదిఁగందనీదింత యెఱుఁగు మధిప.

వ. అనుటయు ధర్మతనయుండు జనంబుల వివాదం బుడుపున
ప్పుడు పుడమిఱేఁడు దూఱునుం బాపంబును బొరయకుండు
తెఱంగు దెలుపవే యనిన దేవవ్రతుం డిట్లనియె. 373

సీ. వ్యవహారశుద్ధి స ర్వప్రజాప్రియకారి
యదియ భూపతికి ధ ర్మాతిశయముఁ
గీర్తియుఁ జేయు న క్షీణసత్యులు ధర్మ
పరులును నైన భూ సురులు నీవుఁ
ద్రాసులుంబోని చి త్తంబులతోడుతఁ
బ్రజవివాదము లెడఁ బక్షముడిగి
విని ధనవాంఛమై ధనికులదెస వ్రాలి
తీర్పక ధర్మంబు తెరువుదప్ప

ఆ. కుండఁ బాడిఁ దీర్చి దండింపఁ దగునెడ
ననుగుణంపుదండ మాచరింపు
మొఱగఁ బలికితేని నుండదు ప్రజ డేగఁ
గనిన పులుఁగుపిండు కరణిఁ జెదరు.

వ. దండించుట దానును. 375

క. నఱకుట యర్థముఁ గొనుటయుఁ
జెఱ నునుచుట కట్టి యుడిచి చేడ్పాటొందం

బఱచుట మొదలుగఁ గలపలు
దెఱఁగులఁ దగవుమెయి నడచు ♦ ధీరవిచారా.

వ. అని చెప్పి భీష్ముండు వెండియు నిట్లనియె. 377

క. తనకడకు వచ్చి మొగ మో
డనివాఁ డగుదూత పల్కు ♦ టకుఁ గోపింపం
జనదు జననాథునకు దూ
తునిఁ జంపిన నరక మగుట ♦ ధ్రువమని రార్యుల్.

తే. కులము శీలంబు హితవాక్య ♦ ములును నేర్పుఁ
గార్యవాదిత్వసద్వచో ♦ గౌరవంబుఁ
దలఁపుగలుగుట దక్షత ♦ యలఘుగుణము
లండ్రుదూతకు నియ్యెడు ♦ నార్యజనులు.

క. మొన దీర్చువెరవు యంత్రము
లనేకము లొనర్చు నేర్పు ♦ నాయుధముల వి
న్ననువును బోటులకర్జం
బును సేనాపతికి నైజ ♦ ములు గావలయున్. 380

క. తనయుల నైనను నమ్మిన
జనపతి సిరి గోలుపోవుఁ ♦ జతురతమై న
మ్మినవాఁడపోలె నమ్మక
యునికి సకలజనుల యెడల ♦ నురహై యుండున్. 381

తే. అనిన విని పాండవాగ్రజుం ♦ డనఘు పురము
భంగియెట్టిన మేలు నై ♦ పుంగవలయు

సనుడు నమ్మహీవిభునకు ౯ ననిమిషాప
గాతనూభవుఁ డిట్లనుఁ ౯ బ్రీతితోడ.

సీ. పరపులోఁతును గల ౯ పరిఖతోఁ బొడవును
ఘనమును నగుకోట ౯ గలిగి తగిన
వాకిళ్ళు బలుపుఁగా ౯ వలి నొప్ప రమ్య గృ
హవ్రాతములు గోమ ౯ రారు వీథు
లందంబులగు మేటి ౯ యంగళ్ళ నెల్ల వ
స్తువ్రలును శోభిల్ల ౯ సుజనబహుళ
మై ధాన్యములును ఘృ ౯ తాది రసద్రవ్య
ములును నానాయంత్రకోశములునుబహువి

ఆ. ధాయుధములు బిరుదు ౯ లగు యోధులును బండి
తులు విలాసినులును ౯ దూతముఖ్య
పరిజనములు నెఱయఁ ౯ బరమోత్సవంబులు
మెఱయఁ బురము చెలువు ౯ మిగుల వలయు. 383

ఆ. అట్టి పురవరంబు ౯ నందు రత్నస్వర్ణ
ముఖము లగుపదార్థము ౯ లకు బంధు
తతికిఁ బతి సురక్షి ౯ తస్థితి సేయునాఁ
డధిప వినుము భూమి ౯ యరయు తెఱఁగు.

వ. అని పలికి మఱియు. 385

క. స్థలముఖ్యము లయ్యెడు పే
ర్కొ-ంచుమాట్లల నెల్లవెరవు ౯ గలిగినవిశ్వా

సులఁ బ్రభుత యిచ్చి భూపతి
నిలుపవలయు వర్ణ రక్ష ణీయత వెలయన్. 386

క. చోరులచేఁ జెడ కుండం
గ్రూరులచేఁ జావ కుండఁ గునలయజనులన్
జారులచేఁ బడ కుండ ధ
రారమణుఁడు నేర్పు గలిగి రక్షింపఁ దగున్. 387

క. అవు బేహారముఁ గృషియు
న్నవరణాలును పసులసొంపు నన యట్లగుటన్
భువిఁ బసులు గలుగుకాఁపుల
నవనీశుఁడు గన్న ప్రజల యట్లరయఁ దగున్. 388

క. అరి మిగులఁ గొనుట గ్రేపులఁ
బొరిమాలం బిదికినట్ల భూవర కడుపున్
వెరవునఁ బెనిచినయట్లగు
నరపతి ప్రజచేత నప్పనము దగఁ గొనినన్. 389

బండారంబు వృద్ధిసేయు తెఱంగు భీష్ముఁడు ధర్మరాజునకుం జెప్పుట.

వ. అనిన విని పాండవాగ్రజుండు బండారంబు గలిగించు వెర
వెట్టిది తెలుపు మని యడిగిన నాపగాతనయుం డతని
కిట్లనియె. 390

క. విను కర్షకులును వణిజులు
నవఘా గోరక్షకులు ధ రాధీశునకున్
ధన మొడఁగూడెడుచోటుల
కనేకవిధములకును నెల్ల నాద్యస్థలముల్. 391

తే. ధనములకు ధాన్యములకు ను ƒ త్పత్తితలము
లయినవాని కించుకయును ƒ హాని గాక
యుండఁ దనకును బండార ƒ మొదవఁ దగును.
పార్జనము సేయ వలయు భూ ƒ పాలకుండు. 392

క. పులి గూనలఁ దినుచందము
గలిగిన నంతటన నిలుచుఁ ƒ గాక ధనంబుల్
గలుగునె మీఁదం గావున
జలగ దిగిచినట్లు గొనఁగఁ ƒ జను నిల సొమ్ముల్. 393

క. అరయుటఁ బ్రజ వర్ధింపఁగ
సరి [1]యేఁటేఁ గ్రమప్రవృద్ధ ƒ మానట్టులుగా
నరపతికిఁ గొనఁగ వచ్చు
న్వెరవులఁ బెంపంగఁ జాల ƒ నెఱయు ధనంబుల్. 394

క. దమియింపఁ దగినవారల
సమయమున దమించి వారి ƒ సంపదలు మహీ
రమణుండు దనదుబండా
రముగా సమకూర్చు జనము ƒ రాగిల్లంగన్. 395

క. ఆపనికిఁ గీడు రోయుచు
భూపాలుఁడు ధనము గలుగు ƒ పురుషులసిరిఁ దాఁ
జూపోపక కొనఁదగదు ద
యాపరుఁడై పెంప వలయు ƒ నఖిలజనములన్. 396

క. ప్రభువుల నుపచారంబుల
విభుఁ డనురాగిల్లఁ జేసి ƒ [2]వెదగొనుఁ గాఁపుల్

---

1. యేఁ డేఁటం బ్రవృద్ధ. 2 వెడగొను; వెదకుం.

సభయులు గాకుండ ధనం
బుభయజగత్సిద్ధి[1]పొందెడు నుర్వీనాథా. 397

క. ఆయతి కిమ్మైయిఁ గలుగు ను
పాయంబులు ధర్మమార్గ ఫలితంబులు గాఁ
జేయుటయ మేలు నృపతికి
మాయాకృతినిపుణుఁ డగుట మతిగాదు సుమీ.

క. ధనము సవరించినఁ బ్రయో
జన మేమి యపాత్రములకుఁ జల్లి చెఱుచునే
ని నరేంద్రముఖ్య వ్యయములు
విను రక్షయ సిరికిఁ బాత్ర విషయము లైనన్.

వ. ఈభంగి నైనంగోశమిత్ర రాష్ట్రబలంబులు వృద్ధిఁ బొందు నీ విట్టితెఱంగువాఁ డవై ప్రజల రక్షింపుము రణంబుల కలయక విరోధుల వధింపుము మఖంబు లొనరింపుము దరిద్రు లైన ధరణీసురాదిసాధుల నరసి కుటుంబరక్షణంబు సేయుము మాంధాతృనకు నాంగిరసుం డగునుతథ్యుండు సెప్పిన హితవాక్యంబు లుపన్యసించెద నాకర్ణింపుము. 400

మాంధాతృన కుతథ్యుఁడు సెప్పినహితవాక్యములప్రకారము.

తే. భూతవృద్ధులు ధనలాభములును గలుగు
ధర్మముననను రాజనువాఁడు ధర్మరక్ష
కై జనించెను గావున నతఁ డరోష
కాముఁడై ధర్మనిరతుండు గాఁగ వలయు. 401

1. బొందు.

క. విను ధర్మమునకు బ్రాహ్మణ
జనము జననదేశ మగుటఁ జనపతి భక్తిం
గొనియాడి యసూయావ
ర్జనుఁడై తగు విప్రకోటిఁ సంభావింపన్. 402

చ. అనిమిషులున్ విభీతు లగుచున్ సట్టిపదంబునఁ జేర్చి మున్ విరో
చనతనయుండు భూమిసురజాతిసువృత్తి కసూయ చేసి నె
ట్టన సిరిఁబాయఁడే బలిక దృఢం బగుభక్తివిశేషమూఁదఁగా
ననఘ యతండు దాఁ బిదపనవ్యయసౌఖ్యవిభూతి నొందఁడే.

ఆ. ధర్మమునకు సిరికిఁ దగ జనించినయది
దర్ప మనిమిషులు నుదాత్తమునులు
నైన నగ్గుణమునను నూనినఁ జెడుదురు
దాని గెలువ వలయు ధరణిపునకు. 404

మ. పరనారీగమనాదిదోషములు భూపాలుండు సేయంగఁ ద
ద్ధరకున్ వర్షములేక యుండుఁ బ్రజకున్ దైన్యంబు వాటిల్లుఁ
జెౕ క్కురుజల్ పైకొను నెందునుం గలయ నుక్కుం దేజ
ముండక్కును । ద్ధుర సైన్యంబుల శతృలొత్తుదురు బంధు
శ్రేణికిం జేటగున్. 405

క. కానిచెయిదములు సేయక
నూనపుధర్మమున నడచు నుర్వీశుఁడు సం
తానము బంధులుఁ బ్రజయును
దానును సేనలును శుభముదలకొనఁ బేర్చున్. 406

వ. అని యిట్లు సెప్పినవాక్యంబులం దెలివొంది ధర్మతత్పరుండై
మాంధాతృండు మహావిభూతిఁ బొంది నెగడె నీవును నట్ల

నెగడు మనిన ధర్మతనయుండు ధర్మంబున నెగడ నేరకా
నుట యెట్టిభంగిం గలుగు నని యడుగుటయు నతనితో
నక్కురు పితామహుండు దొల్లి కౌసల్యుం డగువసుమనుం
డనురాజు వామదేవమహాముని నిట్లు యడిగిన నతం డతనికి
నుపదేశించిన తెఱం గెఱింగించెద వినుమని యిట్లనియె.

**వసుమనుం డనురాజునకు వామదేవుండు సెప్పినధర్మప్రకారంబు.**

ఆ. అర్థసిద్ధికంటె । నరయ నెక్కుడు ధర్మ
సిద్ధి దాన సకల । సిద్ధులును బ్ర
శస్తభంగిఁ జేరు । శాశ్వతకీర్తియు
సంభవించుఁ గలుగు । సద్గతియును. 408

క. ధనమునకై ధర్మముదెస
ననాదరము సేసెనేని । నానృపతికి న
ద్ధనమును జెడు దుర్యశముం
బనుగొనుఁ దుది దుర్గతియును । బాటిలు ననఘా. 409

క. లాభంబు ధర్మముఖ్యము
గా భరపడి మార్గశుద్ధి । గనుఁగొని కైకో
ల్దా భూవరునకు నిహపర
శోభనములు సేఁత చెప్పు । శ్రుతివాక్యంబుల్. 410

క. ధర్మప్రవృత్తి యయ్యును
ధర్మము నాకింతకంటెఁ । దద్విధులం
బేర్మిం బొరయవలయు నను
ధార్మికతాతృష్ణ నత్య । దాత్తుఁడు వొందున్. 411

వ. అని తనవచనంబులఁ దెలివొందిన వసుమనుం డనురాజుతో
వామదేవుండు రాజ్యతంత్రంబున కెల్ల నాధారభూతంబులగు
సామభేదదానదండంబులఁ బ్రయోగించు తెఱం గెఱింగిం
చెద నాకర్ణింపు మని యిట్లనియె. 412

క. మూలబలము సంతుష్టం
బై లాలిత మగుచు నున్నయప్పు డసమంజో
టాలోకించి నడవ భూ
పాలకునకు దండ మతిశుభం బొనరించున్. 413

చ. సమరము సాహసం బధికసంపద లమ్మెయిఁ దెచ్చికోలు ప
థ్యమె రిపులేల కల్గుమ రహంకృతిపెంపును నుత్కటంపుఁగో
పము మగిడింపఁ జాలునరపాలున కట్లగుటన్ హితంబు సా
మము దనయంతవాఁడయినమానవనాథు నెడన్ మహీశ్వరా

క. తనభటులు గలఁగినప్పుడు
ధన మిచ్చి విరోధి నల్పతరు నైనను శాం
తునిఁ జేయవలయు దానము
నన యధికునిఁ దేర్చు టురవునరపతి కెపుడున్. 415

తే. ఆ యుపాయముల్ మూఁటికినువు గాని
యట్టిపగతునియెడ భేదమాచరింప
వలయురంధ్రముల్ దగ వేచువలనుగలిగి
తత్పరతఁ జేయఁజాలుసాధకులఁబనిచి. 416

వ. శుక్రమతంబునం బంచమోపాయం బైనయుపేక్ష వర్తిల్లుదా
నిం బ్రయోగించు భంగియుం జెప్పెద. 417

మ. కలహంబుల్ దమలోనఁ జేసిన నుపేక్షానైపుణం బొప్ప శ
త్రులఁ జూడందగుభూతదానవులపోరుం జూచినట్లిమ్మెయి
న్నలు ముంటందగఁ బుచ్చుభంగి గలుగున్నాథకిన్నై నమం
త్రులయేపున్ విభుఁడిట్లమాపునది నేర్పుం బెంపుఁ బొల్పారఁగన్

వ. అని యత్తెఱంగున వామదేవుండు సెప్పినహితవచనంబులు వాటించి కోసలపతి భాసమానుం డయ్యె నీవును నట్లవర్తిల్లి వెలయు మనినఁ బాండవాగ్రజుండు సమరంబున శత్రులఁ జయించునప్పటిపాడి యెట్లుండు ననుటయు భీష్ముం డతని కిట్లనియె. 419

ధర్మజునకు భీష్ముండు సమరంబునపాడి చెప్పుట.

సీ. పగవాఁడు బలములఁ బన్ని తోఁచినఁ దాను
సబలుఁడై యొంటిమైసంగరంబు
గోరిన నమ్మెయి గొనకొని మాయలో
నర్చిన మాయలఁ బేర్చి గెలుపు
గొనునది వెన్నిచ్చినను బ్రమాదంబునఁ
బడినను నైదువుభగ్నమైన
శరణన్న మ్రొక్కినఁ దురగాళి యెడలిన
నోరుత్తోడఁ బోరుచున్నమన్న నెట్టి

ఆ. పగతు నైనఁ జంపఁదగ దధర్మంబునఁ
జంపుకంటె ధర్మసమరకేళిఁ
జావు మేలు రాజశయ్యఁ జచ్చుట గొఱ
గాదు గాన యోడఁగాదు పోర. 420

క. విను చిల్ల యిడినయాయుధ
మును విషలిప్త మగుశస్త్రమును నెట్టియమి
త్తునిపై నైనఁ బ్రయోగిం
చిననరపతి నరకమున వసించు నృపాలా. 421

క. తనకుం దోడ్పడి యని నో
చ్చినవానిం గాంచి కడఁగి చేష్టింపక యు
న్నన రేందుఁడు బొందుపాపం
బునకుఁ గొలఁది గలదె భరతపుంగవ తలఁపన్. 422

వ. అని చెప్పి వెండియు. 423

చ. అరిపయిఁ బోయి వానిపురమగ్గలికం జెఱుపంగఁ దద్ధరం
బరఁగుప్రజం జలంబుమెయి బాధలఁ బెట్టు టధర్మ మట్టిని
ష్ఠురత యొనర్చు టప్పటికిఁ జూడఁగ మానఁగ రాదయేని భూ
సురగృహదేవగేహములు చూఱనవశ్యముమాన్చుటొప్పగున్

వ. అనిన విని యజాతశత్రుండు రాజధర్మంబుకంటెం బాప
కర్మంబు లేదు పొమ్మని పలికి యిట్లేని రాజున కెట్లును
సద్గోగతి వాటిల్లుఁ గదేయనుటయు నాపగాతనయుం డిట్ల
నియె. 425

క. శరణాగతుఁ గాచియు సని
నరిపోటులఁ బడ్డఁ దెచ్చి యుపసియు ధరణీ
సురులం బోచియు నానా
ధ్వరములు సేసియును రాజు దలఁగు దురితముల్. 426

క. అన విని యమ్మనుజేశ్వరుఁ
డని నసివర్తులయి శౌర్యమభినుతి కెక్కం

దనువు దొలంగినవారికి
ననఘా యెబ్బంగిలోకక్షేమగు నని యడిగెన్.

వ. అడుగుటయు నమ్మహీకాంతునితో శాంతనవుండు శక్రాంబరీషసంవాదంబు చెప్పెద దాన నీయడిగినయది దేటపడు నని యిట్లనియె. 428

## ఇంద్రాంబరీషసంవాదప్రకారము.

సీ. అంబరీషుండు నానాధ్వరంబులు సేసి
కడచని వాసవుకడకు నేఁగి
యచట నుజ్జ్వలవిమానారూఢుఁడును మనో
హరిసంక్రీడనోదారచరితుఁ
డును నై వెలింగెడుకేతనదుబంటు సుదేవుఁ
డనువానిఁ జూచి యక్కయ్యనిమిషేంద్రు
తోడ మదీయభృత్యుఁడు వీఁడు క్రతుముఖ్య
కర్మముల్ సేయఁడెక్కారణమున
తే. ననఘ నాకంబెఁగడుఁ బేర్చియునికి గలిగె
ననుడు నాజిష్ణుఁ డిమ్మహాత్ముని తెఱంగు
సెప్పఁ జిట్టలు వినఁగ వాంఛించితేని
వినుము చెప్పెద నని యిట్టులనియెఁ బ్రీతి. 429

వ. శతశృంగుం డనియెడుదానవునితనూజులు సదముండును విడముండును దముండును ననియెడువారలు. 430

శా. బాహాగర్వముసూపఁగోరి పటుదర్పం బొప్ప నుగ్రాహవో
త్సాహం బూర్జితభంగి గా భయదఘోషస్ఫీతనానావిధ

వ్యూహంబుల్ ధరణీప్రకంపనములై యుద్దామసర్వాంగస
న్నాహత్వంబునఁ బేర్చి తోడ నడవన్ సంరంభశుంభద్గతిన్.

ఉ. మంచిమగండవై ననినుమార్కొనువారయి దాడివెట్టి యొ
క్కించుక శంక లేక ప్రజయెల్లను బెగ్గిలముట్టి యర్థముల్
గొంచు ధరిత్రి గైకొనుటకుం గన లగ్గలమొంది యాతనిం
బంచితి సైన్యయుక్తముగఁ బార్థివ యిట్లనిపల్కె తత్తఱిన్.

మ. పసగన్ వేచని దోర్బలంబున రణప్రావీణ్యముం జూపి నీ
వసురానీకముఁ ద్రుంచి భూప్రజలకున్ హర్షంబు గావించిరా
క సుమీ రాక జయంబు లేక ప్రజ దుఃఖం బొందఁగా రాకనీ
యసువర్గంబులపోక గానెఱుఁగు పెక్కాడంగ నిం కేటికిన్.

మహాస్రగ్ధర. అనినన్ సంగ్రామకేళీవ్యసనరసికుఁడై యట్ల కా
కంచు నిన్ వీ । డ్కొని యాతం డేఁగి తానప్పు దనుజతతి
యాటోపమున్ గూఢచారుం । డనుదృష్టిం జూచి తాని
ట్లను మనమున సైన్యంబుచే పేల శత్రుం । గొన నీనేలా
పురారింగొలుతు నతనికింగోసి యిత్తున్ శిరంబున్. 434

మ. అని నిశ్చయకుఁడై రణం బుడిగి సైన్యం బంతయుం గ్రి
మ్మఱం । జనఁగా జేసి పరేతభూమికి దృఢోత్సాహంబునం
బోయి శం । భునిఁ జిత్తంబున నిల్పి వాలును గళంబుగ
గూర్చినన్ సత్కృపా । ఘనుఁ డద్దేవుఁడు ముందటన్ నిలిచి
ఖడ్గంబుం దొలంగించుచున్. 435

మ. చనునే సాహస మిట్లు సేయ నిది కర్జంబే కతం బేమి యి
ప్పనికన్నం గని చక్కఁజూఁగి ధరయున్ ఫాలంబునుంబొందవఁ

దనముం జేసి యితండు నీపలుకులుల్ ♦ దైతేయులం దాఁక నో
ల్లనివాఁడైన తెలుంగుఁజెప్పి శివును ♦ ల్లం బార్థితంబొందఁగన్

ఉ. ఆపరమేశ్వరుం డితని ♦ కప్పుడు దివ్యరథోత్తమంబునుం
జాపము నస్త్రకోటియుఁ బ్రి ♦ సన్నత నిచ్చి రణంబునందు నీ
యేపున కోర్వ దేవతల ♦ కేనియు దైత్యుల కేని రాదు ప్రా
మ్మోపగ జేని గెల్వుము మ ♦ హిం జరణం బిడకుండుమాజిలోన్

మ. అని వీడ్కొల్పిన నీతఁడుబ్బు మదిఁబొం ♦ గారంగఁదే రెక్కి వే
చని దైత్యధ్వజినీపరితాపమహిమోత్సాహంబులం జీరికిం
గొన కుగ్రోద్ధతిఁ దాఁకి పీనుఁగులపెంగుప్పల్ గొనంజేసె న
య్యనిఁ బైఁదోఁచిన నిద్దఱుందనిమె దై ♦ త్యాధీశులన్ వ్రేల్మిడిన్

వ. ఇవ్విధంబున నదముండును దముండునుం బడినం గని కోపో
ద్దీపితుండై. 439

స్రగ్ధర. వీరోదారోగ్రలీలన్ ♦ విదముఁడు సమరో ♦ ర్విన్ బలోల్లాస
మొప్పం । జేరెన్ బాహాసముల్లాసితఘనరుచిరా ♦ సిప్రభా
భాసురుండై । యారక్షోనాథుపైఁ జే ♦ రలుక మఱపుఁ జే ♦
యంగ నీతండు డిగ్గెం । దే రుద్యత్ఖడ్గదీప్తుల్ ♦ దెసల నిగుడ
దై ♦ తేయవీరుల్ చలింపన్. 440

వ. ఇట్లు విధాతృవశంబునఁ బాదచారియై. 441

మ. దనుజుం దాఁకి కృపాణఖేలనము చి ♦ త్రింబై వెలుంగొందఁ ద
త్తనుసంఛేదనకేలి సల్ప నతఁడుంగదన్నుం బటుప్రస్ఫుర

ఘ్ననకౌక్షేయకధారఁ జీరఁ బడియెం♦దా నాతనింగూల్చెఁ ద
క్కినదైత్యావలి విచ్చి నల్గడఁ బరి♦క్షీణోద్యమత్వంబునన్.

ఇట్లు నిశ్శేషంబుగాఁ బరవీరులం బరిమార్చిన నీరాజ్యంబు పూజ్యంబై వెలసె భూప్రజయుం బ్రమోదంబు నొందె నిత్తెఱంగున నీసుదేవుండు సుకృతవంతుండై యింతటిపదంబున కర్హుండయ్యె నేయజ్ఞంబులును సంగ్రామయజ్ఞంబునకు సదృశంబులు గావు వినుము వీరమస్తకరాశి వేదికగాఁ గృపాణబాణాదిసాధనంబులు సమిత్స్రుక్స్రువంబులుగా శోణితం బాజ్యంబుగా మాంసంబు పురోడాశంబుగా వీరవ్రత దీక్షితుండు సమరాధ్వరంబు సలిపి రుధిరజలపూరయు మస్తిష్కకర్దమయుఁ గేశశైవాలయు నాంత్రఫేనయు భేరీమండూకయు హేతిమీనయు గజకళేబర పులినయు నగుసమరపుణ్యనది నవభృథస్నానంబు సేసి మదీయలోకంబున సుశ్లోకుండై నిత్యస్థితి నత్యుదాత్తపదవిం బ్రవర్తిల్లుఁ బుణ్యాతముం డగుట దనువు దొఱంగ వలయు నని లేమ తెగువతోడి యుని వర్త్తన గతియచాలు నిట్టిదిరణాచరణప్రభావం బేనును బ్రబలదైతేయ వ్రాతశాతనసుకృతంబునం గాదె యీ దేవేంద్రత్వంబు నొందితినని పలికిన నంబరీషుండు సమర శూరుల సమధికపుణ్యత్వంబు దెలిసి సంభావించెనని చెప్పి దేవవ్రతుండు వెండియు. 443

సమరానివర్తనంబు ఎలని ఫలము.

క. జనకుఁడు ప్రతర్దనునకుం,
దనకును రణ మైనయపుడు తనయోధులకుఁ
విను నాకంబును నరకముఁ
గనుఁగొనుఁడని చూపిచెప్పెఁ గౌరవముఖ్యా. 444

తే. పుణ్యతమము భోగాస్పదంబును మనోహ
రాంగనా జనబహులంబు నైనయది ర
ణంబు బిరుదు లై చేసిన నరుల నెలవు
దూరఁబందలచో టిది దుఃఖమయము. 445

వ. అని తనమాహాత్మ్యంబునం జూప నోపినయుభయస్థలంబులుం జూపం జూచి యేచి యవ్వీరులు వెంపు పొంపిరి వోవం దఱియ నుఱికి వైరుల జయించిరి సమరంబు తెగువ దీప్త లక్ష్మిం గరం బొనర్చుఁ బుణ్యతమలోకంబు లిచ్చుం గావున శూరుం డధికపుణ్యోదారుం డని యిట్లు దేవవ్రతుండు ధర్మ సూనునకు సమరా నివర్తనజనవిశేషం బెఱింగించె నని చెప్పిన విని యటమీఁద వారలసంప్రశ్నోత్తరంబులు ప్రవ ర్తిల్లిన విధంబులు వినిపింపు మనుటయు. 446

మ. పరమాయుఃపరమార్థసిద్ధిపరమ ప్రావీణ్యసంపాదనా
దరసంభావితభక్తలోక నిగమాంతస్ఫీతహార్యాగ్రసం
చరణప్రౌఢమయూర చిత్రమహిమా సర్వాత్మవిజ్ఞానసం
పరిపాకప్రకటాకృతీ శమదమోద్భావాహితస్వీకృతీ.

క. యమనియమాద్యష్టాంగ
క్రమాభ్యసననిర్మథితవికారసుచేతః
కమలామోదమయాత్మా
సమతారాహిత్యశస్య సర్వ నమస్యా. 448

మాలిని. సమధికనిరవద్య స్వైరనిత్యప్రభుత్వా
విమలమహిమహేలా నిర్భవత్సర్వసత్త్వా
నమదమలినచిత్తా స్తుత్యదీవ్యన్మహత్త్వా
దమమహితతపస్సద్భావసంవేద్యతత్త్వా. 449

## గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబున శాంతిపర్వంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీరామ.

# శ్రీమదాంధ్ర మహాభారతము.

## శాంతిపర్వము ప్రథమాశ్వాసము.



### లఘువివరణము.

ఈపర్వమునందు భారత యుద్ధరంగమున జ్ఞాతి, గురు, పుత్త్రాది వధచే వ్యాకులమగు ధర్మజుని చిత్తమునకు శాన్తి గలుగుటకై భీష్మాచార్యులచే నొనరింపఁబడిన ధర్మోపన్యాసము వర్ణితము గాన నీభాగమున కీనామ మన్వర్థము.

జయశ్రీసమాలింగితుఁడగు యుధిష్ఠిరుని సంతోషవచనంబుల గారవింప ఋషులు విచ్చేసిరి. నారదుండు కుశలప్రశ్నము సేయ "ఏది గలంచుచున్నది" యని ధర్మజుఁడు నిర్వేదమును బ్రకటించెను. అంత దమ్ములు ద్రౌపది సమాగత ఋషిబృందమును నుచితవచనంబుల సాంత్వనము జేసిరి. పారాశర్యులు బహువిధ వచన రచనలచే బూర్వరాజచరితములఁ బొందుపఱచి ధర్మాధర్మముల నెఱింగించె. దానఁ బాండవాగ్రజుఁడు చిత్తంబు కలంక దేఱి రాజ్యభారనిర్వహణోత్సాహంబవలంబింప ఋషులవలన వసుమతీపాలనానుజ్ఞయు వివిధాశీర్వాదంబులను బడసి ప్రాప్త సామ్రాజ్యుఁడయ్యె. ఇది యీ యాశ్వాసమున వర్ణితమయిన శాంతి నిరూపణము తత్ఫలమును నయి యున్నది.

(2) కృష్ణ, నిజ అనుజ = ద్రౌపది, తన తమ్ములు

(3) ముఖావలోకనమాత్రమున యుధిష్ఠిరుని మనోవ్యథను గుర్తించి నారదుఁడాతనికిఁ గలిగిన దుఃఖకారణము నెఱిఁగియు నాతనిచే జెప్పింపఁదలఁచి భావగర్భముగాఁ బ్రశ్నించుచున్నాఁడు.

పార్థుఁడు = అర్జునుఁడు (యోగరూఢిపదము)

"సూరిసంశోభి, సూత్రిశోభిల్ల" యని పాఠద్వయము.

క్రియావిశేషణపాఠము సారస్యముగాఁ దోఁచుచున్నది.

(4) అలవు = బలము, చలము = మాత్సర్యము, ఉమ్మలిక = దుఃఖము.

(5) సౌభద్రుఁడు = అభిమన్యుఁడు (సుభద్రకుమారుఁడు)

(7) మమ్మ్రి, అనిమొనఁ = యుద్ధమునందు. తాఁ + మము.

[8] కృతఘ్నత = చేసినమేలు మరచుట.

[10] ఇట్టిఁడు = ఇట్టివాఁడు [అట్టి ఇట్టి ఎట్టి విశేషణంబులమీఁది తచ్ఛబ్దవకారమునకు లోపంబు విభాషనగు[ ప్రౌఢ. సమా 9

[14] గాండివి = గాండీవముకలవాఁడు అర్జునుఁడు, విబుధప్రకరంబు = దేవసమూహము,

[15] మార్తాండనందనుఁడు = సూర్యునికుమారుఁడు కర్ణుఁడు.

[16] కన్నియవాఁడు = వివాహముకాకమునుపు (కన్యాశబ్దభవము)

యెనిమిది సంవత్సరముల బాలికకు కన్యయని శాస్త్రీయసంజ్ఞ.

వివాహముకాని బాలికాసామాన్యార్థమున కవుల ప్రయోగము.

[18] ధనంజయుఁడు = అర్జునుఁడు, ఈసు = ఈర్ష్య.

కుంభసంభవుఁడు = ద్రోణాచార్యులు.

[19] పాత్రములుగారు = యోగ్యులుకారు, పాత్రులు రూపాంతరము.

సూక్ష్మిబంబులు మిత్రాదులు విభాషం బుంలింగతుల్యంబులగు.

(21) ఉత్సంగము = తొడ, మస్తకము = శిరస్సు, క్రిందొడ = క్రింది + తొడ.

(23) ఖతలము = ఆకాశము, నీకతమున = నీకారణమున, దారుణ, శాప, ప్రతిహతి = కఠినమైన, శాపముయొక్క, అడ్డు.

(24) విలోకన అమృతసేకంబున = చూపు అనెడి అమృతముచే తడుపుటచేత, తాల్మి = ఓర్పు.

(28) వోహలంబునఁ = ఉత్సాహముతో

29. "నతఁడెల్లి యచ్చలాక్షిబో నీకౌఁగిపట్టి రథంబు పైఁ బెట్టఁబనిచి"
"శ్లో॥ ప్రత్యషేధచ్చతాంకన్యామ...—భీష్మద్రోణావుపాశ్రితః"
అని సంస్కృతము. కర్ణునిపరాక్రమాతిశయము ప్రకటించునవసర
మున నౌచిత్యపోషణార్థ మీవిశేషణము విడువఁబడినదని తోఁచు
చున్నది.

(31) భల్లంబుల్=బల్లెములు. భూపాలఉత్తమాంగములన్=రాజుల శిర
స్సులను, కుంభఘటా, రథవ్రజ, హయశ్రేణి, పదాతిపరితాన
ఉల్లాసంబుల=ఏనుఁగుల సమూహము, రథసముదాయము, గుఱ్ఱ
ములవరుస, కాలినడకన యుద్ధముజేయుబంటులగుంపులయొక్క
సంతోషమును, అవార్యుఁడు=తప్పుకొనుటకు వీలుకానివాఁడు.

(32) హతశేషులు=చావఁగా మిగిలినవారు, కరినగరము=హస్తినాపురము
ఎక్కటిపోరు=ద్వంద్వయుద్ధము.

(33) ఎక్కటెక్కటి=ఒండొరులు (పరస్పరము), అగ్గలికలన్=పరా
క్రమములచే.

(34) రెండుఅవదానంబులు= రెండుచరితములను, నాకలోకపతి=దేవ
లోకమునకు ప్రభువగు ఇంద్రుఁడు.

35. విప్రుఁడలిగెన్=బాణాభ్యాససమయమున విప్రధేనువు బాణగోచ
రంబై మృతినొందఁ బ్రాహ్మణుఁడు శాపంబొసంగె. జమదగ్ని
సుతుండు శాపమిచ్చె- పరశురాముఁడు తన్నువంచించి నందులకు
నీవిద్య నిర్వీర్యమగునని నశాపము. మద్రిరాజు అనుచితమాడి—
శల్యుఁడు కర్ణునకు సారథ్యముజేయుచు ధర్మరాజు చెప్పిన రీతిని
కర్ణుని నిరుత్సాహపఱచెను అందున నాతని కౌసమయమున పూనిక
తగ్గెను, శౌరి=కృష్ణుఁడు.

42. విశ్వాచ్చుఁడు=అర్జునుఁడు.

46. సమబుద్ధిఁజూడక= పక్షుగ్రుఁడనపక్షపాతము వదలక ననిభావము.
నిరాకృతిశీలుఁడు=తిరస్కరించుట స్వభావముగాకలవాఁడు.

47. కర్జంబు ఎఱుంగక=కర్తవ్యమును తెలిసికొనక, దరస్మితము=చిఱునగవు.

49. ఒడమి=ధనము.

51. చుట్టలు=చుట్టములు.

52. తనుకార్శ్యయుతుఁడు=శరీరము కృశించియున్నవాఁడు.

55. బలువునకైకొని= పరాక్రమముచే దీసికొని. ప్రజాధర్మపరిపాలనార్థము హింసయు దానకలిగిన పాపపరిహారమునకై యశ్వమేధము చేయుటయు రాజధర్మము. శ్రీరామమూర్తి రాక్షసవధానంతరము సీతనరణ్యమున విడిచియు సీతాప్రతిమను పత్నిగాజేసికొని యశ్వమేధమొనరించెను. అవభృథము=యజ్ఞసమాప్తి యయిన తరువాత జేయఁదగిన స్నానము.

71. నలుగాలిలోనన్=నాలుగుకాళ్ల జంతువులలో, పతత్రి=పక్షి.

79. తమోమయంబయిన విశ్వమున్=అజ్ఞానమనెడి చీకటిచే నావరింపఁబడిన ప్రపంచమును వర్ణతతిన్=బ్రాహ్మణాది నాలుగుజాతులను, ఆశ్రమకోటిని=బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, యత్యాశ్రమములను, నిఖిలకర్మయోగసవిశేషత=సమస్తమగు కర్మములయొక్క విభేదము (అనగా వర్ణఆశ్రమములకు వేఱువేఱు కర్మముల జెప్పుట. తదీయకల్పనము+అ=అయీశ్వరుఁడు కల్పించినదియె.

81. సుగతికిన్+అ=సన్మార్గమునకై, అరిగిరి=వెళ్ళిరి.

82. నిజ=తనయొక్క, యోగ=పూర్వలేనిదానిం బొందుట, క్షేమ = సంపాదింపఁబడినదాని రక్షణము, వీనికొఱకు.

83. ఘోటకంబులు=గుఱ్ఱములు, కుంజరములు=ఏనుఁగులు.

85. వెలివెలివస్తువుల్= బాహ్యములగు రాజ్యము మొదలగు వానిని తా. అరణ్యమునకేగి యచటవలయు ద్రవ్యములందు మమతగలిగి భైక్షవృత్తిచే శరీరయాత్ర నడపుట కర్మబంధమగును. శారీర

సౌఖ్యములవదలి విహితమగు వంశధర్మమును పాటించి పూర్వ రాజులగుమన్వాదులమార్గము ననుసరించుట రాజధర్మమనిభావము.

87. వైతథ్యంబు బొరయకుండ=విరుద్ధముగాఁ దలపక.

89. సంతత ఉపలాలితయు=ఎల్లప్పుడు బుజ్జగింపఁబడునదియు భద్ర గజ ప్రతిమానుల=భద్రజాతి యేనుఁగుతో సమానులు. లోచన రోచులు=నేత్ర కాంతులు.

91. లోకపాల అంశ ఉదితుఁడు=దిక్పతుల అంశమువలన బుట్టి నవానిగా.

95. గరళుఁడు=విషమిడువాఁడు.

100. మేలంపుఁజందమునన్=పరిహాసముగా,

108. వావిరి=క్రమము.

109. భూనాథునకు + అ, యేల=రాజునకే కాదు

110. వేధ=బ్రహ్మ, భక్ష్యముగ=తినుట కుపయుక్తముగా

112. దురమున=యుద్ధమున, పాండుపాలిత ధరావలయము=పాండు రాజుచే పాలింపఁబడిన భూభాగము

127. తృష్ణ=ఆశ, మిధిలానగరమగ్ని దగ్ధమయినపుడు జనకమహారాజు నిస్పృహుఁడగుటవలన ,,కాలదునాకు నందొక్కటైన'' యని తనవారలకు సమాధానము జెప్పుచు నిశ్చలచిత్తుఁడై తనధ్యేయము నే చింతించు చుండెను. ఈవృత్తాంత మనుసంధేయము.

129. వసట=దుఃఖము, సంసృతిక్లేశపరులు=సాంసారిక కష్టములయం దాసక్తులు.

130. కవ్వడి=రెండు చేతులయందు వడిగలవాఁడు అర్జునుఁడు.

134. త్రైవిద్యులు=వేదముల తెలిసినవారు,

135. అఘలు వెల్లి=భయమనెడి సముద్రము, సతి=భార్య,

137. పురుహూతి పుత్రుడు=ఇంద్రుని కుమారుఁడు అర్జునుఁడు.

138. కలుషతా=దోషమువలన, నాకము=స్వర్గము.

140. పవనుడి=భీముఁడు, అనఁటికంబము= అరఁటి స్తంభము.

144. సమారోహణమునకు=ఎక్కుటకు, సోపానపంక్తిగా=మెట్లువలె, శమము = బాహ్యేంద్రియ నిగ్రహము, దమము=అంతరింద్రియ నిగ్రహము.

147. ఇంద్రియస్తోమవి మార్గవర్తనము త్రుంచి=ఇంద్రియములయొక్క చెడ్డనడకను తొలగించి (జితేంద్రియుఁడవై యనుట)

150 సిద్ధి అసిద్ధులకు వికారమునొందక=కార్యము ఫలించిన సంతోషమును, ఫలింపమి దుఃఖమును బొందక, (ధీరుడవై యనుట)

156. "అసంతుష్టాద్విజోనష్టస్సంతుష్టశ్చ మహీపతిః" యను సూక్తియు లోకోక్తి. అనికి ఓహాటించుట=యుద్ధమునకు వెనుదీయుట, వేదచోదనా ప్రవీణము=వేదవిధులందు నేర్పుగలది.

160. వార్చి=ఆచమనముజేసి, ముచ్చిలి=దొంగతనము.

162. ప్రతీహారులు=ద్వారపాలకులు, దండధారక అగ్రగణ్యా= దండమును ధరించిన వారలలో శ్రేష్ఠుఁడా! ఇది సాభిప్రాయ విశేషణము.

165. సప్తాక్ష అను భూతదండితుఁడను=బాగుగా పరాభవింపఁబడిన దండన గలవాఁడను.

168. నిష్కృతి= ప్రాయశ్చిత్తము, సర్వముని పితృతర్పణములు=దేవతర్పణ, ఋషితర్పణ, పితృతర్పణములు జేయుము.

170. అరుణకమలములకు తెగడు= ఎఱ్ఱనిపద్మముల తిరస్కరించు.

174. తురగమేధ అధిక్రతు ప్రయుక్తి=అశ్వమేధము మొదలగు యజ్ఞములు జేయుట, నిర్ద్వంద్వవృత్తి=సుఖదుఃఖములు, ప్రియాప్రియము

లకు భేదభావము లేక చిత్తమేకాకారముగా నుండుట. అతిథి పితృవిషయమున నప్పత్రికు — మనుజుఁడు పుట్టుటతో మూఁడు ఋణముల గలిగి యుండును. అతిథి సంతర్పణమున మనుష్య ఋణము, యజ్ఞాదికర్మానుష్ఠానముచే దేవఋణము పుత్రలాభమునఁ బితృఋణమును దీర్చు. ఈ ఋణత్రయమునుండి విడివడక నిష్కర్ముఁడవగుట ధర్మువుగాదు.

176. ఆరి=కప్పము (పన్ను) ఆదాయములో నాఱవపాలు రాజున కిచ్చుట శాస్త్రీయము.

178. క్రమ్మనన్=శీఘ్రముగా, సమరజిత అవభరణశాలితన్=యుద్ధమందు జయింపఁబడిన రాజులు కలుగుటతో, ఒండుధర్మములన్.

181 మఖక్రియల్=యజ్ఞములు.

185. బాము=జన్మము, తరము (స్థిరము)

186. తోవలు=కలువలు.

190. ప్రౌఢతమవివేకులు=మిక్కుటమగు జ్ఞానము కలవారు,

191. విద్వత్ ఆదరణీయంబులు=పండితులచే నాదరింపఁబడినవి.

194. ద్రౌపదేయులు=పంచపాండవులు.

196. ఆర్మిలిన్=ప్రేమముతో, బీభత్సుభల్లముల్=అర్జును బాణములు, అలమట=చింత, పరశురాము నోర్చినబల్లిదుండు — భీష్ముఁడు శత్రురాజుల జయించి స్వయంవరలబ్ధలైన అంబ, అంబాలిక, అంబికలనురథారూఢులజేసి కైకొనివచ్చెను. అంబ సాల్వభూపతిని వరించెను. కాని యాతఁడామె యన్యగృహీతయని నిరాకరించెను. అంత భీష్ముని పాణిగ్రహణము జేసికొనమని పరశురాముచేఁ జెప్పించెను. బ్రహ్మచర్యనిష్ఠుఁడైన దేవవ్రతుఁడామె నొల్లక గురువాక్యము తిరస్కరించె. దానఁగ్రోధావేశుఁడై జామదగ్ని ఆయోధన మొనరించెను. అందు బరశురాము నోర్చెను.

207. నీటియందు వ్రాయబడిన యక్షరములవలె నదృశ్యము లగుచు.

209. ఒడయుఁడు=స్వామి.

219. జనన, జరా, మరణ, గ్రాహనిబిడకాలాబ్ధిమగ్నము=పుట్టుక, ముసలితనము, చచ్చుట, యనెడి మొసళ్ళచే దట్టమయిన కాలమనెడి సముద్రమందు మునిఁగినది.

230. కర్కట, ఝుష, నక్ర, కూర్మ చయముతోడ=ఎండ్రకాయ, చేప, మొసలి, తాఁబేలు వీనితో, కురుజాంగలము=కురుక్షేత్రము రాజ అగ్వా యజ్ఞములు=రాజులు చేయదగిన యజ్ఞములు.

231. ఊర్జితఅంగకవిలసత్ అజఅవికంబులు=పుష్టియైన యవయవములచేఁ బ్రకాశించుచున్న మేకలు గొఱ్ఱెలు.

233. బాలురమరణం...... మహిమ. రామరాజ్యమున శంబుకుఁడను శూద్రుఁడు తపమాచరించుటచే నధర్మము వాటిల్లె. దాన నొక విప్రునకు పుత్రశోకము సంభవించెను ఈయధర్మమును నాతఁడు ప్రభువునకు విన్నవించెను. అంత రాముఁడు శూద్రకుని తపము నెఱిఁగి నాతని జంపి విప్రకుమారుని జీవింపఁ జేసెను.

234. పూర్వవంశ్యులగావ...బజపి—సగరచక్రవర్తి కుమారులఱువది వేలమంది తండ్రి యశ్వమేధాశ్వరక్షణకై వెడలిరి. ఇంద్రుఁడు పిరుగానక యశ్వము, గొంపోయి కపిలమహర్షి యాశ్రమముననుంచి వెళ్ళెను. సగరులశ్వమును వెదకుచు భూమిద్రవ్వి పాతాలమున నశ్వమునుజూచి కపిలమహర్షి యీయశ్వము దెచ్చి కృత్రిమ తపస్సు జేయుచుండెనని తపోభంగము జేసిరి. అంత నాతఁడు కనువిచ్చిజూడ నాతేజమునకు వారు భస్మమయిరి. వారిపునీతుల జేయుటకై యసమంజసుఁడు మొదలు భగీరథునివఱకు బ్రయత్నించిరి. భగీరథుఁ డాకాశగంగను దెచ్చి భస్మరాసుల దడిపి వారి నుత్తమలోకముల బొందించెను.

236. "జననమాదిగఁ బాకశాసనుకరమునఁ బ్రభవించు నేయును బాలు ద్రావి — మాంధాతతండ్రి యువనాశ్వుం డనురాజు చిరకాలము సంతానములేనివాఁడై యింద్రునుద్దేశించి తత్ప్రాప్తికై నొక్క యాగము బ్రారంభించెను. పట్టమహిషిచేఁ ద్రావించుట కొక్క కలశమున జలమును మంత్రసంస్కారములచేఁ బూతమగుదాని నుంచిరి. నాటిరాత్రి యువనాశ్వుఁడు దప్పిగొన్నవాఁడై తెలియక నాజలమును ద్రావెను. అంత నాతనిగర్భము భిన్నమై యొక్కశిశువుద్భవమొందె స్తన్యమునకై యేడ్చుచుండ యింద్రుఁ డేఁతెంచి తనతర్జనినిడి దానఁ బాలుఁగుడిపి పండ్రెండుదినములు పోషించెను.

237. అనిమిషాసురయుద్ధము = దేవరాక్షసయుద్ధము, అగ్నిష్టోమము, హయమేధము, (అశ్వమేధ) వాజపేయము, అతిరాత్రము, పౌండరీకము, ఇవియాగవిశేషములు.

242. సత్త్వచయము=మృగసమూహము.

263. లాల, అశ్రు, స్వేదములు=చొంగ, కన్నీరు, చెమటలు.

268. పురిలోడి=వెనుదీసి, ఆఖండలుఁడు=దేవేంద్రుఁడు,

269. వసనేచ్ఛమెయి= ఉండవలెననుకోరికతో, దంభోళి=వజ్రాయుధము, వారణఇంద్రసమయానుఁ=మదపుటేనుఁగు నడకతో సమానమైననడకగలవాఁడు, దాది=పెంపుడుతల్లి.

271. బలవిరోధి=బలాసురుని శత్రువు ఇంద్రుఁడు.

275. దండమువలన వేదచోదితకర్మములు రక్షితములగును. వేదవిహిత కర్మమునశించినఁ బాపమును, వృద్ధిబొందినఁ బుణ్యమును రాజునకగు. కావున రాజ్యముఁ జేయుమని వ్యాసునియుపదేశము.

277. శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్। స్వధ

ర్మనిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ అనుగీతార్థము బోధింపఁబడినది.

289. జనతా=జనసమూహము.

297. అధికధర్మంబునన్=ప్రాయశ్చిత్తము చేత.

307. సూతకాన్నము= పురిటింటియన్నము, వనిత ఉపజీవనశీలుఁడు= స్త్రీధనమువలన జీవించువాఁడు, సూనరి=కటికవాఁడు.

324. పలలము=మాంసము.

326. యజ్ఞశిష్టము (అమృతము)—వైశ్వదేవాదికర్మముల దేవతలకిడఁగా మిగిలినద్రవ్యమునకమృతమని పేరు. "అమృతం విఘసో యజ్ఞ శేష భోజన శేషయోః॥

331. పునుక=కపాలము,

337. కరస్థల ఆమలకసన్నికాశంబు=అఱచేతియందున్న ఉసిరికకాయ వలె సులభమయినది.

339. శాంతనవుఁడు=శంతనుపుత్త్రుఁడు భీష్ముఁడు.

341. అకృత్రిమసమరశీలి=కపటము లేక యుద్ధము చేయు స్వభావము గలవాఁడు.

347. కల్యము=ఉషఃకాలము.

349. కవలు=కవలలగు నకులసహదేవులు, అగ్నిపంచకము- గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము, సభ్యము, అవసథ్యమునను నైదగ్నులు.

354. నాగనగరము=హస్తినాపురము, క్రముక=పోఁక,

355. పణ్యపుణ్యాంగనలు = వేశ్యాస్త్రీలు,

358. లావులు = సామర్థ్యములు, వెరవు = ఉపాయము, తాల్మిలు= సహించుటలు.

360. చంద్రోదయపూర్ణమానంబు = చంద్రోదయకాలమున ధ్వనించుచుండిన. రోదసి = భూమ్యాకాశముల మధ్యభాగము.

361. శంక = సందేహము,

368. మహాశనిప్రహతపాతిత ఉర్వీజనికేతజ = గొప్పపిడుగు దెబ్బచేఁబడిన వృక్షంబువోలె.

371. అభిషేచనికద్రవ్యానయనంబు = అభిషేకమునకు వలయు ద్రవ్యములఁ దెచ్చుట.

373. జాతరూపము = బంగారము, కాంచనదామజుష్టము = బంగారుత్రాటితోఁగూడినది.

389. తేఁకువ = ధైర్యము.

393. పుష్కరాక్షుండు = తామరపువ్వులవంటి నేత్రములుగలవాఁడు.

395. రాజ్యాంగసప్తకము = 'స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్రదుర్గబలానిచ''

షష్ఠాశ్వాసము సంపూర్ణము.

# శాంతిపర్వము ద్వితీయాశ్వాసము.



## లఘు వివరణము.

సమధిగతసామ్రాజ్యుండగు ధర్మనందనుండు రాజ్యతంత్రమునకు ధర్మచర్యకుంగల యవిరోధము (అనుకూల్యము) తెలియంగోరి యొక్కనాఁడు కృష్ణుని మందిరమునకుం జనెను.

గాంగేయునివలన నీవు ధర్మసందియముల వాయుమని పూర్వము వేదవ్యాసులు చెప్పినరీతిని కృష్ణభగవానులు భీష్ముఁడు నీకుపదేశాఙ్ఞుఁడని జెప్పెను. అంత వారిరువురుకలసి భీష్మపాలికిం జనిరి. పితామహుం డాతని ప్రేమమీర గారవించి నీయడుగందలంచినదాని బ్రశ్నింపుమని యెను. ధర్మజుఁడు రాజధర్మముల తేఁటంగు చెప్పవేయన నాతఁడు ధర్మ ప్రకారముల జెప్పందొడంగె. రాజుచే దండనార్హులు, బ్రాహ్మక్షాత్త్రము లకుంగల పరస్పర సాహాయ్యము, వర్ణాశ్రమధర్మములరీతి, దండనీతి జన్మ ప్రకారము, సమరమునకుంగలుగు నుత్తమలోకస్థితి మొదలగువాని పురాణపురుషుల ప్రశ్నప్రతివచన రూపమగు గాథల జేర్కొనుచు నుపన్య సించిన విషయ మీయాశ్వాసమున బొందుపరుపఁబడినది.

2. రేపకడ=ప్రాతఃకాలము.

3. మొదటిరెండు చరణములందలి విశేషణములు తరువాతి యుపమాన చతుష్టయమునకు యథాక్రమముగా నన్వయించుచు. నూతన, ఉదిత, రవిద్యోతిత, ఉదయగిరి, నిభ=క్రొత్తగా నుదయించిన సూర్యునిచేఁ బ్రకాశించుచున్న నుదయపర్వతమువంటివాఁడు, రుక్మబద్ధ ఇంద్రనీలతుల్య=బంగారమునందు గూర్పఁబడిన యిం ద్రనీలమణితో సమానుఁడు: మణిహేమపర్యంక, మేరుభాగము

లకు, మేఘ-కృష్ణులకు, నుపమానోపమేయ భావము. సురుచిరాభరణ-నక్షత్రగణములకు కృష్ణశరీర-గగనములకు సామ్యనిరూపణము. ఈరీతి నన్నిట నెఱుంగునది.

8. ప్రాణాపానవ్యానోదాన సమానంబులను వాయుపంచకమును నిగ్రహించి యింద్రియములను మనస్సునందు వానిని మహత్తత్త్వము (బుద్ధి)నందు నిలిపి జాగ్రత్స్వప్నసుషుప్తుల కతిరిక్తమగుస మాధియనెడి నాలవమార్గంబునం బరమాత్మను ధ్యానించుచున్నాఁడని భావము.

9. నివాతనిశ్చలదీప ప్రకారంబునఁ = గాలిలేనిచోఁ గదలకనున్న దీపపుచందమున.

10. క్షరము=నశించుపదార్థము. పురుషోత్తమాభిధానవాచ్య=పురుషోత్తముఁడను (పురుషులలో శ్రేష్ఠుఁడు) పేరుచేఁ జెప్పఁబడువాఁడా; నిన ప్రమాత్సల్యకల్య = విధేయులయందు ప్రేమభావముచే నొప్పువాఁడా.

11, గోచరత్వసంప్రాప్తంబులు గాఁజేసి = విషయములయందు ప్రసరింపజేసియని తా.

12. రాసి=ఎదిరించి, వాఁడి=శౌర్యము.

15. సుధాగభస్తి = అమృతకిరణుఁడు (చంద్రుఁడు), పొనుంగుపడు= నశించు.

19. శాత=వాఁడియైన, క్రేణిసేయు=పరిహసించు (తిరస్కరించు.

20. శుచియును=అగ్నియు, (స్వయము గాను పరసంసర్గమునను కిల్బిషము నొందనివాఁడు), శుచిషత్తు=నిర్మలమైన యాకాశగతుఁడు.

21. అలఁతులైనవారికంటెనలఁతి= చిన్నవానిలో, చిన్న ,,అణోరణీయాన్మహతో మహీయాన్''.

22. నిక్కమురూపగువాఁడు=సత్యస్వరూపుఁడు.

26. తార్క్ష్యుఁడు=గరుత్మంతుఁడు.

28. షోడశవికారములు — వాక్పాణిపాదపాయూపస్థలను పంచకర్మేంద్రియములు, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములను పంచజ్ఞానేంద్రియములు, ప్రాణాదిపంచవాయువులు అంతఃకరణమును.

31 చరణ, నాభి, శీర్షములు_ధరయు, అంతరిక్షము, దివము, నని యథాక్రమముగా నన్వయము.

38. మున్ను సోమకాసురుఁడు వేదములఁ ముచ్చిలి సంద్రమున దాగికొన విష్ణువు మత్స్యావతారముదాల్చి వేదములనుద్ధరించి దేవతలమన్ననలకుఁ బాత్రుఁడయ్యెను.

46. హలము=నాగలి, ముసలము=రోఁకలి, రౌహిణేయరాము=రోహిణికుమారుఁడగు బలరాముఁడు, జలదనిభాంబరుఁడు=మేఘముతో సమానమగు (నల్లని) వస్త్రముగలవాఁడు.

50. హృషీకేశుఁడు-హృషీక=ఇంద్రియములకు, ఈశుఁడు=ప్రభువు (ఇంద్రియాధిష్ఠాతయగు పరమాత్మ) అతసీపుష్పవర్ణ= అవిశపూవుయొక్క కాంతివంటికాంతిగలవాఁడా;

51. విహంగమధ్వజుఁడు=గరుడధ్వజుఁడు.

52. బ్రహ్మము, సత్యము, ఉదారత, తపము, అనునివి నాలుగు.

54. శ్లో॥ అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాసపూర్వకం
తదేకోపాయతా యాచ్ఞా ప్రపత్తి శ్శరణాగతిః॥
ఇంతకువేఱుఉపాయముచే తన కోరిక సాధింపఁబడనందున గాఢమగు విశ్వాసముకలిగి యనన్యరక్షకుఁడై యాచించుట శరణాగతియై యున్నది.

55. వాఙ్మయ అధ్వర అర్చితుఁడు=వాక్కులనెడి యాగముచేఁ బూజింపఁబడినవాఁడు.

58. వృషాకపి=విష్ణువు. "హరవిష్ణూ వృషాకపీ"

64. నేమినినాదము = బండికంటియొక్కధ్వని, ప్రేతపతి అనుభూ

ఉజ్ఝితంబు= ప్రేతభూభాగాధిపతియగు నీశ్వరునిచే ననుభవింపఁ బడి విడువఁబడినది.

66. ఏకవింశతివారంబుల=ఇరువదొక్కమాఱు.

68. చరువు=హవిస్సు, హవ్యమును వండుటకుపయోగించెడి పాత్రమనకును వ్యవహారముకలదు.

69. సూదనుఁడు=చంపువాఁడు.

78. సహస్రబాహుఁడు=కార్తవీర్యార్జునుఁడు.

83. ఉద్ధతరోషపావకశిఖాపరిస్ఫీతుఁడై=అతిశయమయిన రోషమనెడి యగ్నిజ్వాలలచేఁ బ్రకాశించినవాఁడై.

126. ఎండినసకలౌషధిప్రతతి=వాడిన సమస్తవృక్షజాతులను.

128. ఆదర్శము=అద్దము, వార్చి=నిరీక్షించి.

136, తెలచి=ప్రార్థించి, బలసి= పరివేష్టించి (చుట్టుకొని)

145. బృంహితుఁడు=వృద్ధిబొందినవాఁడు.

149. ఉభయజగదుదాత్తత=ఇహపరలోకములయందభివృద్ధి

155. శోణితఅంబుపూరంబు=నెత్తురనెడి యుదకప్రవాహము, కేశశైవలము=వెండ్రుకలనెడినాచు, అక్కజము=ఆశ్చర్యము.

158. వాగె=కళ్లెమునకు బిగింపపగ్గము, తనప్రాపు అ,=రాజధర్మము యొక్క సాహాయ్యము. ధర్మాచరణమునకు నర్థార్జనమునకు కామసేవనమునకు రాజధర్మము మూలము. పరమపురుషార్థ సాధనము. తొల్లి భూపతులు తపోవనభూములఁ గ్రూరమృగముల వేటగొనియు, ధర్మధ్వంసకుల హింసించి యాగాదికర్మముల నిర్విఘ్నముగ జరిపించియు పురుషార్థచతుష్టయము గాపాడిరి.

159. రూపఱు=నశించు. పూర్వరాజమార్గము ననుసరింపనిచో లోకస్థితివ్యాకులమై నశించునని భా.

160. తరణి=సూర్యుఁడు.

166. ఓజ=ఉత్సాహము. దైవపౌరుషములు రెండును కలసి కార్యసాధకములని భా.

178. మావంతుఁడు=మావటీఁడు.

179. తమకిగాక=త్వరగలవాఁడుఁగాక,

180. మాఱొడ్డులు=ప్రతిఘటనములు.

195. ప్రాణగొడ్డము= ప్రాణముల హింసించునది (ప్రాణపట్టు శబ్దభవము.)

211. సాంవత్సరికుఁడు=జ్యోతిష్కుఁడు.

212. కిన్నరేశుఁడు=కుబేరుఁడు, ఈడితసంపన్నుతయు = కొనియాడఁబడిన మహైశ్వర్యమును.

214. చిత్తరుజ=మనోవ్యథ.

215. క్షతాత్ త్రాయత ఇతి" క్షత్త్రియః । రంజయతీతి రాజా॥ యని వ్యుత్పత్తులు.

224. దస్యుహింస=శత్రుహింసనము.

231. హవ్యభుగ్భజనంబు=అగ్నిహోత్రోపాసనము.

239 హజ్జ=పాదము.

255. మీలు=చేపలు. సూ. బహువచనంబు పరంబగునప్పుడు చేను, పేను, మీను, శబ్దంబుల నువర్ణంబులోపించు. బేహారము=వ్యాపారము.

284. ఖాణము=గుఱ్ఱము మొదలగువాని భక్ష్యము.

301. ఆత్మగుణవిహీనమైన కర్మానుష్ఠానము. నిష్ఫలమని భా.

320. ఈయుపాఖ్యానమువలన బ్రాహ్మక్షత్త్రియులు పరస్పరసాపేక్షములనియు దేవభూదేవులు లోకస్థితికి మూలములనియుఁ దెలియఁబడుచున్నది.

343. స్వవర్ణోచితమగు జీవనోపాయము లేనిచోఁ బరధర్మాశ్రయము

కర్తవ్యమని పూర్వము సామాన్యముగా జెప్పఁబడియె. అదియు తనకవ్యవహితవర్ణధర్మమనియు దాననునశక్తుండగువాఁడు తరువాతి వాని ధర్మమని యీవిధమగు క్రమము దీనసూచితము.

349. మేనిప్రసన్నదనము=శరీరముయొక్క మనోజ్ఞత.

358. కెలని మహీశ్వరుఁడు=పార్శ్వగతుఁడగురాజు, వెఱగు=భయము.

363. అయతికాఁడు=ధనము నార్జించువాఁడు, తోఁక + అవధాయకుఁడై=అవధానముకలవాఁడై,

364. త్రైకాల్యవేది=భూతభవిష్యద్వర్తమానములఁ దెలిసినది, పులుఁగు=పక్షి. నిసుపట్టు=నివాసము. (హీఁడు) ఇతఁడను నర్థమర్థాను స్వారసహితరూపమున గలుగు.

366. సాభిజ్ఞానంబుగా=గుఱుతుతోఁగూడినటుల

378 దూతనుదండించుటయు నంగవికలునిజేయుట మొదలగునవిధర్మశాస్త్రములయందు గలవు గాని దూతవధముకు నిషిద్ధమనివిభీషణుఁడు రావణునకుపదేశించెను. దీనిరామాయణసుందరకాండమున విపులముగాగానవగు.

380. విన్నను=నేర్పు.

387. కువలయము=భూచక్రము. నానా-కలువ.

393. ధనధాన్యోత్పత్తిస్థానములు వృద్ధిబొందునుపాయము చేయకయవాని వలన బండారము వృద్ధిబొందింపనెంచుట పులికూనల దినుటవలన దానివంశము నశించినవిధమగును. కావన జలగబాధగలిగింపక రక్తముద్రావినటుల ప్రజలకభివృద్ధి జూపుచు తాను కోశమును వృద్ధి బొందింపవలెనవి భా.

395 396 దండవార్హులదండించి వారివలన ద్రవ్యముగొని కోశమును బెంపొందింపనగుగాని నిరిగలచోటుల ననూయుచే బాధింపజనదు.

406. కానిచయిదములు=కూడనిపనులు.

418. తనశత్రుపురీరుధిరుల పరస్పరము పోరుచుండినదానుపేక్షాపరుఁడు కావలయును.

421. చిల్లి=శల్యము.

435. పరేతభూమి=శ్మశానము.

438. ఉబ్బు=ఉత్సాహము, దైత్యధ్వజిని=రాక్షససైన్యము.

440. బాహాసముల్లాసిత ఘనరుచిర అసిప్రభా భాసురుండు=హస్తము నందు ప్రకాశించుచున్న గొప్పఖడ్గముయొక్క కాంతులచే వెలుఁగుచున్నవాఁడు.

443. సమరము యజ్ఞముగాఁబోల్పఁబడినది. యాగమొనరించి యవభృథస్నాతుఁడై యెట్టిస్వర్గమలంకరించునో సమరాంగణము నమృతినొందినవాఁడట్టి పదవినొందునని భా.
రణరంగమునందలి వస్తుజాతము యజ్ఞసాధనములతో నభేదముగా వింపఁబడినది. పురోడాశము=సూర్యాసకాగముగా జేయబడిన హవిస్సు. మస్తిష్కకర్దమ=మెదడసెడు బురదగలది, సుశ్లోకుఁడు=మంచికీర్తి కలవాఁడు.

"నమ్మమి మృత్యువు పెద్దయు, నమ్మటయుపమృత్యువగుట నరపతి నమ్మియునమ్మక పనిగొనునది ని, త్యమ్మను సూక్ష్మమతి దాను నరయఁగవలయు॥"

ఈపద్యమున (851) "మిత్త్రి నమ్మిపనులుగొనునది" యని పాఠాంతరముగలదు. ఇందు మొదటిపాఠము పూర్వవాక్యసందర్భమునను మూలమునకు ననుసారియని తోఁచెడిని. చూడుడు సంస్కృత భారతము.

శ్లో॥ తస్మాత్పరిధానం యత్కార్యం ప్రత్యక్షం తత్సమాచరేత్॥

* * * * *

తస్మాద్విశ్వసితవ్యంచ శంకితవ్యంచ కేషుచిత్॥

చివుకుల సుబ్బరామయ్య,
సాహిత్య విద్యాప్రవీణ.

ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీ

హరిహరనాథాయనమః..

సీ. ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్షణం బనియు
యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చ
యంబని మహిమ గొనియాడుచుండ

వివిధ తత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు.

నన్నయ.